



విశాఖపట్టణం సముద్రతీరంలో సాయంకాల దృశ్యం

ఫొటో :—జి. రామమోహాన్ (చిపురుపల్లి)



విశాఖపట్టణం హార్బరులో ఓడలు పోయే మార్గం

ఫొటో :—జి. రామమోహాన్ (చీపురుపల్లి.)

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 45
సంచిక 33
15.4-53

విజయ వైశాఖ శుద్ధ విదియ; బుధవారం.

" అందాల మేఘమాల "

ఫోటో: శ్రీ కె. వి. రామచంద్రమూర్తి.

పైడియంచుల పైటదాల్చిన
కొండలకన్నియ హొయలు గనుమా !

# విషయానుక్రమణిక

ముఖచిత్రం :- అసోసియేటెడ్ ప్రొడ్యూసర్సువారి...అరవ చిత్రంలో నటి బి. ఎస్. సరోజ.



## రచయితలకు సూచన

మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు వానిని త్రిప్పి పంపగోరినట్లయితే, రచనలూ చిత్రాలతోపాటు అవసరమైన స్టాంపులను గాని, స్టాంపులు అంటించి చిరునామా వ్రాసిన పెద్దకవర్లనుగాని చేర్చి పంపవలసిందని మనవి. అలా పంపేవారికి మాత్రమే వారి రచనలను గాని, చిత్రాలనుగాని ప్రచురించే ముందు ప్రచురణ విషయమై తెలియపరచగలము. మొదట స్టాంపులను చేర్చి పంపక, తరువాత ఉత్తరాలు వ్రాసి స్టాంపులు పంపినట్లయితే, వెతికి పంపడం కష్టమని రచయితలూ, చిత్రకారులూ గుర్తించ ప్రార్థన. ఈ సందర్భములో రచయితలు, చిత్రకారులు మాకు సహకార మివ్వగలరని ఆశిస్తున్నాము.



ఒకచో నేలను బవ్వళించు; నొకచో
    నొప్పారు బూసెజ్జపై;
నొకచో శాకము లారగించు; నొకచో
    నుత్కృష్ట శాల్యోదనం;
బొకచో బొంత ధరించు; నొక్కొకతఱిన్
    యోగ్యాంబరశ్రేణి;—లె
క్కకు రానీయడు కార్యసాధకుడు
    దుఃఖంబున్ సుఖంబున్ మదిన్.

తా॥ కార్యమును సాధించుటయందే పట్టుదల గలవాడు, ఒకప్పుడు అవసరమైతే కటిక నేలపై పరుంటాడు. ఒకప్పుడు వీలైతే పూలపాన్పుమీద కూడా పరుంటాడు. ఒక్కొక్క సందర్భములో కాయగూరలు మాత్రమే తినిఉంటాడు. సందర్భపడితే, మంచి వరి అన్నము ఆరగిస్తాడు. ఒక్కొక్క సందర్భములో పీలికలతో కుట్టిన అతుకుల బొంతను ధరిస్తాడు. మరియొకవేళయందు చక్కని వస్త్రములను ధరిస్తాడు. ఈరీతిగా కార్యసాధకుడు సుఖమునూ లెక్కచేయడు కష్టమునూ లెక్కచేయడు.

కార్యసాధకునకు ఒక్కనికి మాత్రమే కాదు. ఎవరికైనా, ఎటువంటివానికైనా, జీవితములో కావలసిన సౌకర్య పదుపాయములు ఒక్కటే విధంగా జరుగగలవా? అది అసంభవం. బాల్యంలో ఉన్న సరదాగాని ఉత్సాహం గాని వయస్సు వచ్చినతర్వాత ఉండదు. వయస్సులోనూ, పడుచుతనములోను ఉన్నటువంటి శరీర పటుత్వము, పట్టుదల, ఆత్మధైర్య విశ్వాసము వార్ధక్యంలో ఉండవు. వార్ధక్యంలో ఉండేటటువంటి దూరదృష్టి, ఆత్మపరిశీలన, నిశ్చలమైన ధర్మచింత, భగవద్ధ్యానము తత్పూర్వదశలయందు ఉండవు. ఈవిధంగా దేహపరిస్థితియున్నూ, బుద్ధివైఖరియున్నూ మారుతూ ఉంటాయి. జీర్ణశక్తి బాగా ఉన్నప్పుడు బొబ్బట్లు, ఆవడలతో సహా ఆరగించి భోజనసౌఖ్యం బాగా అనుభవిస్తాడు. కాని జీర్ణకోశముయొక్క సామర్థ్యము తగ్గిన తర్వాతనూ, గట్టివస్తువులను నమలుటకు తగిన దంతములు ఊడిపోయిన తర్వాతనూ, పసిపిల్లలు తిన్నట్లుగా మెత్తని గుజ్జువంటి అన్నం తినాలి. పోకచెక్కలు తమలపాకులు బోసినోటితో తాను నమలలేక ఎవరైనా పడుచువాళ్ళు కమ్మని తాంబూలం వేసికొన్నప్పుడు వారివంక తాను బోసినోరు తెరచుకొని చూస్తూ ఉండవలసిందే. ఈవిధంగా చూస్తే, "కాల మొకరీతి గడచునే—కాలికైన?" ఈశ్వరునకైనప్పటికీ ఏకతీరుగా కాలం గడువగలదా? అనే సందేహం ఎందుచేత కలుగగూడదు?

ఈశ్వరు డంటేనే కాలస్వరూపుడు. కాలం అంటేనే మార్పు అని నిర్వచించాలి. ఎందుచేతనంటే, సూర్యుడు తూర్పున ఎర్రగా ఉదయిస్తాడు. కొంతసేపటికి ఆకాశంలో నడినెత్తికి వచ్చి మండిపడుతూ అగ్నిప్వాలాగున ఉంటాడు. మరి కొంతసేపటికి పడమటికి దిగిపోయి ఎర్రని కుంకుమబొట్టువలె ఆకాశంలో చూడడానికి వీలుగా ఉంటాడు. తూర్పున ఒక స్థలంలో ఉదయించి క్రమేణ ఆ స్థలంనుంచి మారిపోయి పడమట యింకో స్థానంలోనికి వచ్చి అస్తమిస్తాడు. ఈవిధమైన మార్పు జరిగినందువల్లనే మనము దానిని ఒక పగలు అని లెక్కపెట్టుకుంటూ ఉన్నాము. ఈ అవస్థాభేదమునే, యీ స్థానభేద అంతరాయమునే ఆధారంగా తీసికొని దానినే 3 భాగములుగా విభజించి ఉదయమనిన్నీ, మధ్యాహ్నమనిన్నీ, అపరాహ్ణమనిన్నీ లెక్కిస్తున్నాము. దానినే యింకా విభజించి 12 భాగాలు చేసి పగలు 12 గంటలు అంటున్నాము. ఒక స్థలంనుంచి ఇంకొక స్థలంలోకి సూర్యబింబం మారుతూ ఉండకపోయినట్లయితే, ప్రపంచంలోని గోడ గడియారాల లంబము (*Pendulum*) అటు యిటు కదలకపోతే, జేబు గడియారాల ముళ్ళు కదలకపోతే, ప్రపంచంలో ప్రాణుల గుండెలు కూడా కొట్టుకొనకపోతే, నాడీసంచలనం లేకపోతే, జగత్తులో

ఏ విధమైన చలనమూ లేకపోతే, ఏ పదార్థానికిన్నీ ఒకప్రదేశంనుంచీ ఇంకొకప్రదేశానికి మార్పు లేకపోతే, మనకు కాలమును తెలిసికొనే అవకాశంగాని, ఆధారంగాని ఉండదు. సృష్టిలో ఉన్నటువంటి వస్తుచలనంవల్లను, ఆ చలనంవల్ల ఆ వస్తువుకు కలిగిన ప్రదేశ పరివర్తనమువల్లను, స్థానభేదంవల్లను "కాలం" అనేది గ్రహిస్తున్నాము. ఆ చలనమును, ఆ మార్పును, "కాల"స్వరూపంగా "కాల"ప్రమాణంగా గుణిస్తున్నాము.

కాబట్టి చలనంగాని, మార్పుగాని జగత్తులో లేకుండా జగత్తు అంతా స్తంభించిపోతే, స్థాణువు అయిపోతే, "కాలం"అనేదిగాని, "కాలజ్ఞానం" అనేది గాని మనకు ఉండదు. అయితే, ఈశ్వరుడు స్థాణువు మాత్రమే కాదు. నిశ్చలుడై స్థావరంగా ఉన్న యీశ్వరుడే, చలిస్తూ జంగమంగా ఉన్న ప్రపంచంలో, మనకు జంగమ రూపంలో ప్రత్యక్షమవుతున్నాడు. ఈశ్వరుడనేవాడు వేరే ఎవడో ఉన్నాడని భ్రమపడనక్కరలేదు. బ్రహ్మాండంగా వాదించనక్కరలేదు. ఈ కనపడే ప్రత్యక్ష జగత్తు యావత్తూ యీశ్వరుడే. ఈ కన్పించే జగత్తు కదులుతూ ఉంది - తిరుగుతూ ఉంది. ఆ మార్పునే మనము నిత్యమూ గమనించి ఆ చలనమునే, ఆ మార్పునే కాలమానంగా గుణిస్తూ పరిగణిస్తూ ఉన్నాము. "కాలం" అనేది జగత్తులో ఉన్న నిత్య చలనానికీ, మార్పుకూ పెట్టవలసిన ఒక పేరు. అంతకు తప్ప "కాలం" అంటే మరేమీ లేదు. జగత్తుయొక్క నిత్య సంచలన, నిత్య పరివర్తన లక్షణమునుగూర్చి మనకు ఏర్పడిన జ్ఞానమే "కాలం." ఈ "కాలం" అనే లక్షణమే యీశ్వర లక్షణము, లేదా జగల్లక్షణము.

అసలు విషయం ఒక్కటి గ్రహిస్తే చాలు. అదేమిటంటే, "కాలం" అంటే "మార్పు". మార్పు అంటే కాలం. ఈ "మార్పు" అనేదిన్నీ, "కాలం" అనేదిన్నీ ఏదైతే జగత్తులో కన్పిస్తూ ఉన్నదో, అదే యీశ్వరుని లక్షణంఅన్నారు. కాని, వేదాంతులు యింకో మాట కూడా అన్నారు. "భగవంతుడు కాలస్వరూపుడుమాత్రమే కాదండీ! భగవంతుడు కాలాతీతుడైన అచంచలుడూ నిశ్చలుడూ అయిఉన్నాడండీ!" అన్నారు. "మనకు ప్రత్యక్షంగా కన్పించేటటువంటిది ఏదంటె మారుతూఉన్న ప్రపంచ తత్వం మాత్రమే - కాని, మారుతూ ఉండనటువంటి ప్రపంచ తత్వం కూడా ఒకటి ఉన్నదన్నారు. దానిని కూడా మనం గ్రహించడానికి ప్రయత్నం చెయ్యవలెనండీ! మహాజనులారా!" అని తత్వవేత్తలైనవారు చాలా కాలం క్రిందటనే శోధించి, బోధించి, ప్రబోధించారు. అందుకనే యీశ్వరుడు చరలింగం మాత్రమే కాదు, స్థిరలింగం అని కూడా అన్నారు. భగవంతుని జంగమ స్వరూపం మనము జగత్తులో చూస్తున్నాముగాని, భగవంతుని స్థావరస్వరూపం మనం చూడడంలేదు.

వసంతకాలం వచ్చింది. చెట్లు చిగిరించాయి. పూలుతీగెలు పుష్పించాయి. మల్లెపూలు, ముంజకాయలు, మామిడిపళ్లు సమృద్ధిగా వచ్చాయి. ఈ ఋతువులో దుప్పటి కప్పుకొనకుండా వెన్నెలలో ఆరుబయట హాయిగా నిద్రపోవచ్చు. కాని వర్షాకాలం ప్రవేశిస్తే యీసుఖం ఈసౌకర్యం ఉండదు. తడికట్టెలు మండవు. మడి బట్టలు ఆరవు. పల్లెటూళ్ళల్లో బురద ఊళ్లల్లో ప్రయాణాలు సాగవు. వ్యవహారములన్నీ వానకాలపు చదువుగా సాగుతూ ఉంటాయి. అటుపైన శీతకాలం వచ్చిందంటే గొంగళ్లు కప్పుకోవాలి - కంబళ్ళు కొనుక్కోవాలి. ఆకలి మందగిస్తుంది. ఒంటిపూట భుజించడం, "నక్త భోజనాలు చేయడం" (నత్తాలు ఉండడం) అవసరం. ఈవిధంగా ఋతువు మారగానే భోజనపద్ధతి, పచన పద్ధతి, శయనపద్ధతి, వస్త్రధారణపద్ధతి, మారుతుంది. వేసంగిలో హాయిగా ఆరుబయట నేలమీద చాప వేసికుని పరుంటే, ఒళ్ళు తెలియని సుఖమైన నిద్ర పట్టుతుంది. కాని యీ ఆట యితర ఋతువులలో సాగదు. ఈ వేసంగిలో ఏది తినినా జీర్ణమవుతుంది. కాని, యితర ఋతువులలో మితంగా హితవైనదే పథ్యంగా తినాలి. కనుక, ఎవరైనా ఆరోగ్యం కాపాడుకొని, జాగ్రత్తగా పదికాలాలపాటు బ్రతుకదలచుకుంటే, కాలానుగుణ్యంగా సంచరిస్తూ వ్యవహరిస్తూ ఉండాలి. దీర్ఘాయుష్మంతులమై జీవించవలెననే పట్టుదలను కూడా ఒక కార్యదీక్షగా గమనించాలి. ఇతర కార్యదీక్షలన్నింటికంటె యిది చాలా ముఖ్యమైన ప్రధాన కార్యదీక్ష. ఈ కార్యదీక్షతో కార్యసాధకుడైన వాడు కాలానుగుణ్యంగా ప్రవర్తిస్తాడు. "ఒకచో నేలను పవ్వళించు; ఒకచో నొప్పారు పూసెజ్జపై." అటువంటి ఆరోగ్యసాధకునకు ఉండేటటువంటి ఆనందం ఒక్కటే. అది ఏదంటే తన ఆరోగ్యభాగ్యం చెడకుండా సక్రమంగా సలక్షణంగా ఉన్నదనే ఆనందం అటువంటివానికి ముఖ్యంగా ఉంటుంది. అదే ముఖ్యమైన ఆనందం. ఒకపూట భోజనం లేకుండా ఏకాదశి ఉపవాసం చేసినవాడు తిండి లేకుండా శరీరాన్ని శోషింప జేస్తాడు. మరునాడు ద్వాదశి వస్తే పంచభక్ష్య పరమాన్నములతో ఆరగిస్తాడు.

బుద్ధిమంతుడైన గృహస్థయినవాడు ఒకరోజున శరీరాన్ని శోషింపజేస్తాడు. ఇంకోరోజున పుష్టినిచ్చే బలమైన ఆహారం ఆరగిస్తాడు. నిరాహారంగా ఉండడం దుఃఖం అనిన్నీ, విందు ఆరగించడం సుఖం అనిన్నీ వర్గీకరించడం లోకాచారం. కాని, తన ఆరోగ్యం బాగుపడుతున్నదనే ఆనందం ఆ గృహస్థుకు ఏకాదశినాడూ ఉన్నది, ద్వాదశినాడూ ఉన్నది. కనుక, అతనికి ఉన్న ఆనందం, ఆ సుఖంలోనూ, ఆ కష్టంలోనూ సమానంగానే ఉంది. నిరాహారం అయినా, మృష్టాహారం అయినా ఏకాదశినాడూ ద్వాదశినాడూ కూడా సమానంగా ఏ మార్పూ లేకుండా ఉన్నటువంటిది "ఆనందం." అది అవస్థా భేదాలకున్నూ, స్థూలంగా కన్పించే సుఖ దుఃఖాలకున్నూ మార్పులకున్నూ ఏకాదశికిన్నీ, ద్వాదశికిన్నీ అతీతమైనది. ఈ స్థిరలక్షణమైన ఆనందమే మార్పులకూ కాలానికీ అతీతమైనది. జైలులోకి వెళ్ళినప్పుడు తాను దేశసేవ చేస్తున్నాననే ఆనందం మహాత్ముడు అనుభవించాడు. రౌండు టేబిలు సభకై లండనుకు వెళ్ళిన గాంధిమహాత్ముడు సాంకే ప్రభువు ప్రభృతులతో సమానంగా దివ్యమైన హోటలులో రమ్యమైన సోఫాలలో కూర్చుండి భారతదేశ విమోచనకోసం వాదించాడు. తాను దేశసేవ చేయుచున్నాననిన్నీ, తద్వారా భగవంతుని సేవ చేయుచున్నాననిన్నీ ఎర్రవాడా జైలులో ఎంత ఆనందం అనుభవించాడో, రౌండుటేబిలు సభలోకూడా అంత నిండైన ఆనందం అనుభవించాడు. ఆనందం అనేది ఆయనకు య్యా ఖైదులోనూ ఉంది, ఆ సభామందిరంలోనూ ఉంది. ఖైదు అనుభవించడం దుఃఖం అని అంటాము. రాజమందిరంలో సుఖాసవాసీనుడై ఉండడం సుఖం అని అంటాము. కాని, మహాత్మునకు ఆ రెండింటిలోను ఆనందం ఒక్కటే తీరుగా అచంచలంగా ఉంది. అయోధ్యలో ఉన్నా, అరణ్యంలో ఉన్నా శ్రీరామచంద్రుడు తాను సత్యవాక్యపరిపాలన చేయుచున్నాననే ఆనందం కలవాడై యున్నాడు.

అయితే, ఒక్క సందేహం కలుగుతుంది. వేర్వేరు అవస్థలు మారినప్పటికీ ఆనందం అనేది కాలాతీతమైన స్థిరప్రమాణంలో స్థిరలింగంగా ఉంటూఉన్న విధంగానే, అవస్థా భేదములతో నిమిత్తం లేకుండా దుఃఖం కూడా ఒక్కటే స్థిరస్థాయిలో ఎవరికైనా ఉంటుందా?

పూర్వ మొక గ్రామములో ఒక వృద్ధ

# ★ కాలక్షేపం ★

బ్రాహ్మణుడు రామాయణ పురాణం చెప్తూ ఉండేవాడు. గ్రామంలో ఉన్న పెద్దలు పిన్నలు స్త్రీలు పురుషులు యావన్మంది సాయంకాల మయ్యేసరికి ఆ పురాణ కాలక్షేపానికి హాజరవుతూ ఉండేవారు. ఆ సమావేశంలో ఆడవాళ్ళు కూర్చుండుటకు మాత్రము ఒకప్రక్కగా స్థలం ప్రత్యేకించారు. స్త్రీలు కూర్చుండే స్థలంలో వితంతువులు మాత్రం ముందుగా వచ్చి కూర్చుండేవారు. ఆ పురాణ కాలక్షేపం రమారమి రెండు మాసాలవరకు జరిగింది. బాలకాండతో రామాయణం ప్రారంభించి శ్రీరాములవారి బాల్యదశకథ అంతా పూసగ్రుచ్చినట్లుగా వాల్మీకి వర్ణించినదానికి రంగుపెట్టి ఆ బ్రాహ్మడు సొగసుగా చెప్పినప్పుడుఅందరూ ఆనందించారు. కాని, ముందుగా వచ్చి కూర్చున్న ఒక యౌవన వితంతువుకు మాత్రము కళ్ళవెంబడి నీళ్ళు వచ్చాయి. అవన్నీ ఆనందబాష్పాలని ప్రక్కనున్నవారు అనుకొన్నారు. రోజురోజుకు రామాయణం కథ సాగుతోంది. రాములవారు అయోధ్యానగరం విడిచి సీతాలక్ష్మణ సమేతంగా అరణ్యానికి వెళ్ళారు. ఆ కథంతా రోజూ వింటూ ఉన్నటువంటి ఆ వితంతువు యింకా వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది. రాములవారి కష్టాలు వింటూఉంటే దుఃఖం పొంగిపొంగి వస్తోంది కాబోలు ననుకొన్నారు. అందువల్ల ఆ పడివయస్సు పూర్వసువాసినిని ఎవ్వరూ పలుకరించి ప్రశ్నించలేదు. కాని, రామాయణంలో యుద్ధకాండకూడా అయిపోయింది. రావణాసురుని సంహారానంతరం శ్రీరాములవారు జయభేరీలతో లంకనుంచి అయోధ్యకు వానరులతోసహా వచ్చి పట్టాభిషేకం అయినారు. సీతారాముల పట్టాభిషేకంకథ ఆబ్రాహ్మణుడు ఆనందపరవశుడై చెప్తూఉంటే సభలోఉన్న ప్రతివాడూ తానుకూడా రాములవారి పట్టాభిషేకానికి హాజరైనట్లుగా ఆనందంపొంది ఒక్కసారిగా అందరూ "రఘుపతిరాఘవ రాజారాం! పతితపావన సీతారాం!" అని సంకీర్తన ప్రారంభించారు. కాని ఆ వయసు వితంతువు ఆ పట్టాభిషేక మహోత్సవ కథా సందర్భములో కూడా ఏకధారగా కంటివెంట వచ్చుచున్న నీళ్ళను తడియారని చెంగుతో తుడుస్తూనే ఉంది. అప్పుడు ప్రక్కనున్న ఒక యిల్లాలు అది చూచి "సీతా అమ్మవారు కష్టాలు పడుతున్నప్పుడు నీవు దుఃఖపడినావు. బాగానే ఉంది. కాని సీతామహాలక్ష్మీ సమేతులైన రాములవారికి వైభవంగా పట్టాభిషేకం జరుగుతున్నదని ఆయన దివ్యంగా వర్ణించి చెప్తూఉంటే, ఇప్పుడుకూడా నీవు ఏడవడం ఎందుకమ్మా" అని ప్రశ్నించింది. అందుకు ఆ యౌవన వితంతువు తన హృదయ దుఃఖమర్మమును ఆవిడతో యిలా వివరించి చెప్పింది. "ఆ పురాణం చెప్పే టటువంటి బ్రాహ్మణుని చేతిలో ఒక తాటి యాకుల గ్రంథం ఉంది. ఆ తాటియాకుల బెజ్జములలోనుంచి ఏకతీరుగాఉన్న ఒక సన్నని నులకత్రాడుతో ఆ తాటియాకుల పుస్తకమును ఆయన కట్టి ఉంచుకొన్నారు. ఆ సన్ననిత్రాడును చూచినంత సేపున్నూ స్వర్గస్థుడైన నా భర్తగారు జ్ఞాపకం వస్తున్నారు. ఆయన మొలత్రాడు సరిగ్గా యిదే మాదిరిగా ఉండేది. ఈ పురాణ కాలక్షేపానికి నేను వచ్చిననాటినుంచీ ఆ త్రాడుచూచి, నా భర్త గుర్తుకువచ్చి యిన్నాళ్ళూగా ఏడుస్తున్నాను" అన్నది. కాబట్టి బాలకాండం వచ్చినా, అరణ్యకాండం వచ్చినా, ఆఖరుకు పట్టాభిషేకం వచ్చినా, యుద్ధం ముగిసి ఉత్సవం వచ్చినా, కథలో ఎన్నిమార్పులు వచ్చినా, అవస్థాభేదములు ఎన్నివచ్చినా, ఏ మార్పూ లేకుండా ఉన్నది ఆమె దుఃఖం. అన్ని సర్గలలోను విసర్గ యున్నదన్నట్లుగా, "మానిషాద" శ్లోకం మొదలుకొని పట్టాభిషేక వర్ణనవరకూ ఆమెకు విషాదమే ఏకతీరున ఒకే స్థాయీభావంగా ఉన్నది. ఆనందం అనేది అచంచలంగా స్థిరలింగంగా ఉంటూ ఉన్న విధంగానే ఇటువంటి ఆత్మవిచారం కూడా ధర్మదీక్షాపరులైన కర్మవీరులకు ఉంటుంది.

బాల్యంలోనే భర్తలను గోల్పోయి ఆ బాల్యనిర్బంధవైధవ్యం అనుభవిస్తూ దిక్కెవ్వరు నాకని విలపించెడి వితంతువుల విలాపం విని వీరేశలింగం పంతులుగారు బాల వితంతువులకు తిరిగి వివాహాలు చేయించి వారికి జీవితసౌఖ్యం చూపించక పోయినట్లయితే తన జీవితం వ్యర్థమని విలపించాడు. ఆంధ్రదేశానికి వైధవ్యశాపం తొలగినది యిప్పుడు కాదు. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు మొట్టమొదట ఆంధ్రదేశంలో వితంతు వివాహములను సాహసించి సశాస్త్రీయంగా చేయించిన ఆనాటి కాలంలోనే ఆంధ్రదేశానికి వైధవ్య కళ పోయి కొత్తతేజం వచ్చింది. ఆనాటి సంఘ సంస్కరణ వీరుడైన వీరేశలింగంగారు ఆ కార్యదీక్షలో తాను కష్టాలుపడ్డాడు. ఒక్క బాలవితంతువును పదిలంగా తీసికొని రావడానికి పశువుల పేడతో మురిగియున్న గొడ్లసావడిలో ఆయన తరుణానికి వేచి ఒక రాత్రి అంతా పరున్నాడు. బాల వితంతువును ఎత్తుకొని పోయినాడను నేరమును ఆయనమీద ఆరోపించి ఆయనను పట్టుకోవలెనని ప్రయత్నిస్తే,ఎండయనక వానయనక నిద్రాహారాలు మాని అధికారులవెంట పరుగెత్తినాడు. ఈ అవస్థలన్నీ ఆనందంతో అనుభవించాడా? దుఃఖంతో అనుభవించాడా? మన సంఘంలోఉన్న బాల వితంతువులు అధోగతిపాలై ఉన్నారనే విచారం, హృదయావేదన, ఆయనను నిరంతరంగా వెంటాడుతూ ఉంది. ఆయన సన్మానసభలలో కూర్చుండినా, ఆయనకు ఎవ్వరెంత ద్రవ్యం యిచ్చినా, ఆ హృదయావేదన,-తాటియాకుల గ్రంథం తాలూకు అన్ని సర్గలలోను అంతర్గతంగా ఉన్న సూత్రంలాగున,-ఆయన జీవిత ధర్మ సూత్రంగా ఉంటూనేఉంది. తాను చేసేది మానవసేవ అనిన్నీ తద్వారా మాధవుసేవ అనిన్నీ ఆయన ఆనందంపొంది అనేక అవస్థలను భరించాడు. పేడ కుప్పలమధ్య గొడ్లసావడిలో పరుండినప్పుడు యీ ఆనందం అనుభవించాడు. రాజమహేంద్రవరంలో ఆయనకు బ్రహ్మాండమైన గౌరవ సన్మాన సభలు చేసి పూలహారములువేసి అగ్రాసనాధిపత్యం ఇచ్చినప్పుడుకూడా యీఆనందమే అనుభవించాడు. తన జీవితం యీరీతిగా వినియోగించాననే ఆనందంతో జీవితం ముగించాడు. తన జీవితం యింకా యీ విధంగా వినియోగించలేక పోయితినిగదా అనే విచారంతో తన జీవితం ముగించాడు. ఈ ఆనందం ఆయన అనుభవించిన సుఖదుఃఖాలను లెక్కచేయని మూలసూత్రం. ఆయన యావజ్జీవిత హృదయావేదనకున్నూ హృదయానందమునకున్నూ భేదం లేదు. రెండూ ఒక్కటే. అది ఆయన హృదయావేదన అన్నప్పటికీ, అది ఆయన హృదయానందం అన్నప్పటికీ, ఆయనలో అచంచలమైన పరతత్వం ఒకటి ఉంది. ఈ అచంచలమైన తత్వం దేశకాలపాత్రాతీతమైనది. అది స్థిరమైన తత్వం. అది స్థిరలింగం. కాలాతీతమైన, కాలపరివర్తనాతీతమైన అవస్థాభేదాతీతమైన యీశ్వరతత్వమే వీరేశలింగ తత్వం. అందుచేతనే "లెక్కకురానీయడు కార్యసాధకుడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్."

"నిర్మల ధర్మ కర్మ దీక్షా పరతంత్రుడు"

(56-వ పేజీ చూడండి)

# "ఆంధ్రులకు విజ్ఞాపన"

## కీ॥ శే॥ వీరేశలింగం పంతులుగారు



కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులు. జయంతి ఏప్రిల్ 16. (జననం-1848 ఏప్రిల్ 16.)

"ప్రియస్వదేశీయులైన యాంధ్ర మహాజనులారా!...

దేశాభివృద్ధికి సంస్కార మన్ని విషయములలోను సమానముగా నుండవలయును. కాని యొక్క విషయములో మాత్రమే పడుచుండుట చాలదు. ఏక విషయాభివృద్ధి యెప్పుడును నిజమయిన యభివృద్ధి కానేరదు. ఈసత్యమును మనవారి మనస్సులలో దృఢముగా నాటింపవలెనని యీవరకన్నిసారులు నాయుపన్యాసములలో చెప్పుచు వచ్చినాను. తనివి చెందక చెప్పిన దానినే కడసారి మీకిప్పుడు మరల చెప్పుచున్నాను.

బయట సుఖదాయకములైన రాజ్యాంగ స్వాతంత్ర్యములను సంపూర్ణముగా పొందగలవారమయినను మన యింట కుటిల కులాచార భూతమునకు దాసులమయి కడుపున బుట్టిన బిడ్డలకు స్వాతంత్ర్యములైన నియ్యక బాల్య యనాథ బాలలు సంతత దుస్సహ వైధవ్య దుఃఖాదులపాలయి బాధపడుచుండగా నేమును మనమేమి సుఖమనుభవింప గలుగుదుము? ఇంట సుఖదాయకములైన సత్కులాచార స్వాతంత్ర్యములను సంపూర్ణముగా పొందగలవారమయినను ధనప్రాణములకు రక్షణము చేయని క్రూర నిరంకుశ ప్రభుత్వమునకు నిరంతర దాస్యము చేయవలసినయెడల నేమి సుఖమనుభవింప గలుగుదుము? ఇంటను బయటను గూడ హేయదాస్యమునుండి విముక్తులమయి యుభయస్వాతంత్ర్యమును బొందగల్గినప్పుడు గదా మనము నిష్కళంక సౌఖ్యము నొంది యవ్యాజానందము నొందగలుగుదుము! కాబట్టి నిజమైన దేశక్షేమము నపేక్షించిన పక్షమున దేనిని నుపేక్షించక సమస్త స్వాతంత్ర్యముల నిమిత్తమును సమస్తాభివృద్ధుల నిమిత్తమును సమానముగా కృషి చేయుడు. అప్పుడు మీరు దేశమును సౌఖ్యవంతముగాను సంతోషవంతముగాను నభ్యుదయవంతముగాను జేయగలుగుదురు.

ఇప్పుడు మన యాంధ్రదేశము మేలుకొని కన్నులు తెఱచి సౌందర్యమును పూని చుఱుకుదనమును పూని దేశాభివృద్ధికరములైన నానాక్షేత్రములయందు మహోత్సాహముతో కృషి చేయుచున్నందుకు నేనెంతయు సంతోషమొందుచున్నాను. ఇది మన దేశముయొక్క పురోభివృద్ధికి శుభసూచకముగా నున్నది. ఇటువంటి స్థితి మన మాతృభూమికి కలుగగా జూడవలెనని నేను ముప్పది నలువది సంవత్సరముల క్రిందట నభిలషించుచుంటిని. అప్పుడా కోరిక దివాస్వప్న సదృశముగా కనబడినది. ఇప్పుడది ప్రత్యక్షసిద్ధమైనది.

అప్పుడు దేశభాషలో పురుషులు చదువుటకు సహితము తగిన పుస్తకములు లేకుండినవి. ఇప్పుడు పుస్తక రచనకయి సమాజము లేర్పడి పురుషుల కుపయుక్తములైనవి మాత్రమే కాక స్త్రీలు చదువదగిన పుస్తకములు గూడ దిన దినాభివృద్ధి నొందుచున్నవి.....అప్పు డాంధ్రవార్తాపత్రికలంతగా లేకయుండిన యొకటి రెండును జదువువారు లేకయు, దివా నక్షత్రములవలె తేజరిల్లకుండెను. ఇప్పుడు దేశభాషా వృత్తాంత పత్రికలసంఖ్య యధికమయి వేల కొలది చదువరులను గలవయి కొన్ని పట్టపగటి సూర్యునివలె ప్రకాశించుచున్నవి... ఇటువంటివి చెప్ప బూనినచో ననేకము చెప్పవచ్చును. బాపట్ల మొదలయిన స్థలములందు జరిగిన సభలును (ఆంధ్ర మహాసభలును) ఆసభలలో జనులు చూపిన యుత్సాహమును మన దేశముయొక్క వర్తమాన స్థితిని, కర్తవ్యనిర్ణయవ్యగ్రతను, నూతనోద్యోగమును సమగ్రముఖముల జాటుచున్నవి. అయినను సాంఘిక సంస్కారాదులయందు మనవారికి మాటలలోగల శూరత్వము కార్యములో నింకను నేనభిలషించినంత కనబడుటలేదు.....

సంస్కారసంబంధమున వివిధవిషయములలో వివిధమార్గముల వివిధ బుద్ధిమంతులు పనిచేయవలసియున్నది. మీలో ననేకులనేక శాఖలలో బనిచేయవచ్చును. మన దేశాభివృద్ధి కిప్పుడు పని కావలెనుగాని యదిలేనిపొడిమాటలు కావలసియుండలేదు.

ఓభక్తవరదా! ఓ దీనరక్షకా! దీనుడనైన నేను మాయాంధ్రదేశమును సంతతాభివృద్ధి నొందుచుండుదానినిగా జేయ బ్రార్థించుచున్నాను, నా ప్రార్థన సఫలము చేయుదువు గాక!

ఇట్లు విన్నవించు విధేయ సేవకుడు,

**కందుకూరి వీరేశలింగం.**

(స్వీయచరిత్రమునుండి)

# దత్తత

(సీరియల్‌నవల)

శ్రీ పినిసెట్టి శ్రీరామమూర్తి

## 1

వైద్యుడు రామయ్యచౌదరి ప్రతిభ ఒకనాడు కృష్ణాజిల్లా అంతటా ప్రకాశించింది. రానురాను ఆయన తగ్గడంవల్లనో, ఆయుర్వేదం తీసి ల్లోపలి పైమెట్టుకుపోవడంవల్లనో, ...ర కారణంగానో ఆదాయం పూర్తిగా ...గిపోయింది. ఇంతకూ యాభైవిళ్ళప్రాయం ...నే చౌదరి కాలం చేశాడు.

తమ్ముడు చంద్రయ్యచౌదరికి అన్న ...గారు పోవడం పూర్తిగా విచారకారణమే ...యినా, బ్రతికి ఋణభారాన్ని పెంపు ...చేయకుండా అప్పుచేసినందుకు మాత్రం, ...ల్పంగా సంతోషించలేకుండా ఉండ...క పోయాడు.

రామయ్యచౌదరి భార్య శాంతమ్మకు ...ర పోయేనాటికి వస్తువాహనాలు ఏమీ ...ని రాము, రవి, అనే తన యిద్దరు ...మా అన్నింటికన్నా ఘనంగానే ...ంటూంది.

తండ్రి పోయేనాటికి రవికి రెండేళ్ళు, ...ముకి నాలుగో సంవత్సరం.

శాంతమ్మ తోటికోడలు సుభద్రకు, తన ...ర్త కమీషను వ్యాపారంలో వచ్చే కొద్ది ...బత్తంలో, ఈ కుటుంబాన్నికూడా ...షించడమనే భారం, బాధాకరం ...కుండా పోలేదు. అయితే చంద్రయ్య ...చౌదరి మాట కాదనలేక కాలాన్ని కష్టం ...గానే వెళ్లబుచ్చుతోంది.

కొందరు బాధనుగాని సంతోషాన్ని ...గాని, చాలాకాలం దాచుకోలేరేమో; ఒక ...కి గుప్తపరచగల గంభీర స్వభావులున్నా, ...ర్తించే వ్యక్తులఎదుట మాత్రం ఏదో ...రూపంలో ఆ భావం వెళ్లడిగాకుండా ...దు.

సరిగ్గా చౌదరి కుటుంబంలో అదే జరి...ంది. భర్తపోయిన అనంతరం ఆరుమాసాలు ...నాయాసంగా గడిపిన శాంతమ్మ తోటి...కోడలు ప్రవర్తనద్వారా యిక ఎక్కువ కాలం ఆ యింట్లో ఉండగల అవకాశం లేదని నిర్ణయించుకోగలిగింది.

ఆరోజు బాకీదారు బంగారయ్య, చంద్రయ్యచౌదరిని కష్టంగా మాటాడి వెళ్లినతర్వాత, పరలోకంలో ఉన్న బావ గార్ని ఉద్దేశించి సుభద్ర "చచ్చికూడా సాధిస్తున్నావా మహానుభావా" అంది.

పెరటిలో బిడ్డలకు తిండి పెడుతున్న శాంతమ్మకు, ఈ మాటలు వినిపించాయి. అయితే బ్రతికుండగా తన భర్త తమ్ముడుపై కక్షకట్టింది ఏమీ లేదని తెలుసు. కాని తోటికోడలు నోటినుంచి వెలువడ్డ ఈ అసందర్భ అర్థరహిత పదానికి, కారణం ఊహించడానికి ఎక్కువకాలాన్ని వినియోగించలేదు.

అంతటితో సుభద్ర ఊరుకున్నా, శాంతమ్మలో తలెత్తబోయే మనోవ్యథ మళ్ళీ పడేదేమో; కాని మళ్ళీసుభద్ర మాటలు వినిపించాయి! "ఈ పాడు సంసారాన్నికూడా మా నెత్తిమీద పడేసి మరీ పోయాడు."

తను బ్రతికుండగా ఎంతో గౌరవంగా 'మీరు' అని ఉచ్చరించిన మరదలు, తనువు చాలించిన తర్వాత, నీచంగా మాట్లాడి, ఈలాంటి అభాండాలు వేయగలదనే ఊహ, ఏ కోశాన్నైనా - చౌదరికీ కలిగుంటే; చచ్చి బ్రతికున్న భార్యను యింత బాధపెట్టకుండా వాళ్ళకు ఏదో ఒకదారి చూపించి వెళ్ళేవాడేమో. కాని, తమ్ముడి కుటుంబం వేరు, తన సంసారం వేరు అని బ్రతికున్న రోజుల్లో భావించగల అవకాశం, ఏనాడూ కలగలేదు చౌదరికి, అదే ఊహిస్తోంది శాంతమ్మ.

ముద్ద పెట్టబోతూ చెమ్మగిల్లిన కళ్ళతో ఉన్నతల్లిని చూసిన రవి—"అమ్మా" అన్నాడు.

బిడ్డ హెచ్చరిక ద్వారా మేలుకున్న తల్లి రవినోట్లో ముద్దపెట్టింది.

ప్రక్కగా కూర్చొని స్వంతంగా అన్నం తింటూన్న రాము, తల్లికేసి ఆశ్చర్యంగా చూశాడు; "ఏడుస్తున్నావేమమ్మా"

పమిటచెంగుతో కళ్ళు తుడుచుకొని, కాళీ అయిన గిన్నెలు తీసుకొని లేచింది శాంతమ్మ.

కొట్టకుండా తిట్టకుండా యిష్టంలేని వ్యక్తులను ఇంట్లోనుంచి సులభంగా సాగనంపే విద్య పురుషులకన్నా స్త్రీలకే బాగా తెలుసు.

చావిడిలో డస్కు దగ్గిర కూర్చొని పద్దులు వ్రాసుకుంటున్నాడు, చంద్రయ్య చౌదరి. ఎడబిడ్డను చంకను వేసుకొని చిన్న బట్టలమూటతో, రాముతో, వచ్చి నిలబడిన ఒదినగార్ని చూసి, మొదట్లో ఆశ్చర్యపడ్డాడు.

"ఏం వొదినా?"

శాంతమ్మ మాట్లాడ లేకపోయింది.

"ఎక్కడికీ ప్రయాణం?" కంఠంలో కాస్త ఆత్రం ధ్వనించింది.

"ఎక్కడకన్నా వెళతాను" రుద్ధస్వనితో భారంగా వినిపించిందీ మాట చంద్రయ్యకు. మరీ ఆశ్చర్యంగా చూస్తూ లేచి నిలబడ్డాడు.

"ఎవరేమన్నారు?"

శాంతమ్మ వాడిన నవ్వు నవ్వింది.

"అవేవారు పోయారుగా బాబూ!" ఈ మాటతో ఆమె కళ్లల్లో నీళ్ళు పొడచూపాయి. కాని నిగ్రహించుకొంది. మళ్లీ "ఎవరూ ఏమీ అనలేదనీ ఒక్కడి రెక్కలమీద వచ్చే ఆదాయాన్ని అన్యాయంగా తింటూ కూర్చోడం బావుంటుందా?" అని ప్రశ్నార్థకంగా మానింది.

చంద్రయ్య ఆలోచిస్తున్నాడు. ఈనాటికీ అతనికి కలుగని యీ ప్రశ్న ఒదినగారికి కలిగిందంటే, కారణం ఎవరైయ్యుంటారు? ఇదే ఆలోచించాడు.

"ఇప్పుడేవస్తా."

శాంతమ్మ ఆశ్చర్యంగా చూసింది. చంద్రయ్యను వెనక్కి పిలుద్దామనుకుంది. కాని వెంటనే ఆలోచించింది. చంద్రయ్య వెళ్లినదానివల్ల చెడ్డ ఏమీ రాదని ఆమెకు తెలుసు.

తిన్నగా లోపలకు వెళ్ళాడుచంద్రయ్య.

నోసట నిశ్చింతగా కుంకుమ ధరిస్తూన్న సుభద్ర, భర్త అడుగులు చప్పుడు విని వెనక్కి తిరిగి చూసింది.

"వొదిన్ని ఏమన్నా అన్నావా?"

ఈ సూటైన ప్రశ్నకు మొదట్లో కాస్త స్తంభించింది. తరువాత ఈలా అడిగింది,

"నేనేమన్నా అన్నానని మీకు చెప్పిందా"

"లేదు"

"మరి?" ప్రశ్నార్థకంగా చూసింది.

చంద్రయ్య వెంటనే సమాధానం యివ్వలేకపోయాడు. కాని మెల్లగా యిలా అడిగాడు.

"కారణం లేకుండా ఎందుకు ప్రయాణం చేస్తుంది".

"ఆసంగతి నన్నడిగితే నేనేం సమాధానం చెప్పను."

మొహం చిట్లించుకొని, విసురుగా వంట గదివైపు దారితీసింది. చంద్రయ్యకూడా అంతు పట్టలేదు. ఆలోచనగా వీధి గుమ్మం కేసి మెల్లగా నడుస్తున్నాడు.

"ఇదిగో!"

ఈ మాటవిని వెనక్కి తిరిగిచూశాడు చంద్రయ్య. సుభద్ర వంటగది గుమ్మంలో నిలబడి పిలచింది.

"వొదినగారి మీద మీ కంతగా దయుంటే; వెళ్లనివ్వకండి. ఈ దుబారా ఖర్చు చూస్తూ మాత్రం ఈ పొదుకొంపలో నే నెంతోకాలం ఉండలేనిమాట నిజం. నేనే కాదు, తనఖావాళ్ళక్రింద ఈయిల్లు కాస్తాపోయినతర్వాత, మీరు కూడా ఊరూరా బయలు దేరవలసిందే -"

"ఏమిటే నువ్వనేది" చంద్రయ్య కంఠం బిగ్గరగా ధ్వనించింది.

"ఆమాత్రం అర్థం తెలుసుంటే; మన బ్రతుకు లెప్పుడో బాగుపడును."

చేయి ఒక్కసారి కోపంకొద్దీ ఎదుటకు ఊపి విరక్తితో కూడిన భావాన్ని వికటంగా వెల్లడిచేసి, గదిలోకి వెళ్ళిపోయింది.



చంద్రయ్య స్తబ్దుడై నిలబడిపోయాడు. భార్యమాటల వైఖరినిబట్టి కోపం వచ్చినా-కేవలం ఆమె మాటల్లో- ఆమె స్వార్థచింతే గాకుండా తన శ్రేయస్సు కూడా ఉందని గుర్తించగలిగాడు. అయితే అన్నగారు జ్ఞప్తికి రావడంతో, మలిన మవబోతూన్న చంద్రయ్య నిష్కపటమానసం కొద్దిగా కంపించింది. కాని ఒదినగార్ని ఆపుచేసినా లాభంలేదని గ్రహించాడు. ఆమె యిష్టానికి వ్యతిరేకించకూడదని నిర్ణయించుకున్నాడు. తిన్నగా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

చావడిలో చాలా సేపు వేచివున్న శాంతమ్మ మరది రాక, ఆలస్యం కావడంతోనే, తిరిగి తన్ను చూడలేక రాలేకపోయాడని ఊహించుకుంది. మెల్లగా నడచి గుమ్మం దిగబోతోంది.

"వొదినా."

మరది మాటవిని వెనక్కి తిరిగిచూసింది.

"లోపలికి రా."

చంద్రయ్య చౌదరి తిన్నగావచ్చి రాముని చంకను వేసుకున్నాడు.

"నువ్వు చేసేదేమిటి బాబూ"

శాంతమ్మ ఆత్రంగా అడిగింది.

"నేనేమన్నా చేసేవాడినైతే నిన్ను వెళ్ళనిస్తానా?...అన్న బిడ్డలు...నాబిడ్డలే అనుకున్నాను"

అతని కంఠం గద్గదికమైంది. కళ్ళు కూడా చెమ్మగిల్లాయి. శాంతమ్మ గుమ్మంలోపలకు వచ్చింది.

చావడిలో రాముని క్రిందకు దింపి "తప్పకుండా వెళ్లు వొదినా. బండికోసం కూడా పంపించాను. కాని వెళ్ళేముందు, నీమనస్సులో నాపై కష్టముంటే, ఎదురుగానే తిట్టి వెళ్ళు, కాని పరుల ఎదుట నన్ను నేరస్థునిగా నిలబెట్టకు."

ఈమాటలు విని శాంతమ్మ చకితురాలైంది. బరువుగా, బాధగా నిట్టూర్చింది కూడా.

"చంద్రయ్యా! ఇందులో ఎవరూ నేర

# ★ వత్రత ★

ష్ఠులు కారు...అన్యాయంగా దూషించడం నాకు చేతకాదు...ఎప్పుడైనా బాధగలిగితే; నాకు కలిగిన రాతగురించి నన్ను నేనే దూషించుకుంటాను."

గుర్రపుబండి గుమ్మంలోకి వచ్చిఆగింది. శాంతమ్మ కళ్ళుతుడుచుకుంది.

"తీసుకో వొదినా"

అశ్రుమలినమై ఉన్న కళ్లతో ఆశ్చర్యంగా చూసింది. పదిరూపాయల కాగితాలు చంద్రయ్య, చేతిలో ఉన్నాయి.

"నూట ఏభై ఇంతే ఉన్నాయి పెట్లో; ఇంతకన్నా ఏమీ యివ్వలేనందుకు బాధగానే వుంది...తీసుకో" చంద్రయ్య ఉద్వేగంతో వచ్చే మాటలనుండి, అతని ఆవేదనామయ హృదయాన్ని చూడగలిగింది శాంతమ్మ. తిరిగి మాట్లాడకుండా తీసుకుంది.

రాముని చంద్రయ్య ఎత్తుకొని బండిలో కూర్చోబెట్టాడు. మెల్లగా శాంతమ్మ, రవి కూడా ఎక్కి కూర్చున్నారు.

బండి కదిలింది. చూపు మేర వరకూ చూసి చంద్రయ్య కళ్ళు ఒక్కసారి తుడుచుకొని లోపలకు వచ్చాడు. సంతుష్టిగా నిట్టూరుస్తూ చిరునవ్వుగా చూస్తున్న భార్య మొగంకూడా ఆ కాస్సేపటిలో చాలా వికారంగా భయంకరంగా కనిపించింది చంద్రయ్యకు.

## 2

శాంతమ్మ తెనాలి రైల్వేస్టేషన్ రైలులో దిగింది. రాముని నడిపిస్తూ రవిని చంకను వేసుక స్టేషన్ వెలుపల కొచ్చింది. అది కన్నవారి వూరు కావడంవల్ల చిన్ననాటి సంగతులు ఆమె మనస్సులో కదల నారంభించాయి. తాను కాపురానికి వెళ్ళి పది సంవత్సరాలు కావచ్చింది. పది సంవత్సరాల్లో అనేక మార్పులు జరిగాయి.

ఆమె తల్లి చిన్ననాడే పోయింది. తండ్రి తనకు పెళ్ళయిన రెండో సంవత్సరములోనే మరణించాడు, ఆర్థిక బాధవల్ల ఏనాడో పరారైన అన్నగారు ఎక్కడున్నదీ తెలిదు. ఇక ఆగ్రామంలో వృద్ధాప్యంలో ఉన్న మేనత్త వెంకమ్మ మాత్రం ఉంది. ఇక అక్కడికే వెళ్ళాలని ఆమె నిర్ణయం. ఒక జట్కాలో బిడ్డలతో ఎక్కింది.

"ఎక్కడి కమ్మగారూ" బండివాడు అడిగాడు.

"మారీసుపేట ...' వెంకమ్మగారింటికి," అని జవాబు చెప్పింది.

"చెల్" అని గుర్రాన్ని కమ్చీతో కొట్టాడు.

కొంతదూరం బండి నడిచిన తర్వాత, బండివాడు ఇలా అన్నాడు.

"పాపం హోటలు కట్టేసిందమ్మా."

శాంతమ్మ ఆశ్చర్యపడింది.

వెంకమ్మ పూటకూళ్ళు పెడుతూ ఆరు సంవత్సరాలుగా ఆ తెనాల్లో ఉంది. బాగా భోజనం పెడుతుందనే పేరుకూడా సంపాదించింది. అందుకే పూటకూళ్ల వెంకమ్మ పేరు తెలీనివాళ్ళు ఆ వూళ్ళో బహు తక్కువమంది.

"హోటలెందుకు కట్టేసింది ?"

శాంతమ్మ కారణాన్ని తెలుసుకోడానికి ఆత్రంగా అడిగింది.

"ఉబ్బసరోగం గదండీ...అందులో వయసు మీరింది."

ఈలోగా రోడ్డు కడ్డుగా పండుకున్న కుక్కను తప్పించే దృష్టిలో ఉండిపోయాడు బండివాడు. శాంతమ్మ భారంగా ఒక్క నిశ్వాసం విడిచిపెట్టింది. ఏ ఆశతో తాను ఊరు చేరుకుందో, అది కాస్తాకూడా శూన్యమయిందా అని బాధపడింది. కేవలం మేనత్త సంపాదనమీదనే జీవించాలనే ఉద్దేశం ఆమెలో లేదు. అయితే వెంకమ్మకు చేదోడు వాదోడుగా ఉంటే, వంట విషయంలో కాస్త కష్టపడితే, తన బిడ్డలతో సహా జీవించవచ్చుకదా అనే ఆశే, అత్తిల్లు విడిచేంత తెగింపునకు మొదట్లో ఆధారమైంది.

ఒక పెంకుటిల్లు ముందుగా బండివచ్చి ఆగింది. శాంతమ్మ బిడ్డలతో బండి దిగింది.

"ఎంత బాబూ ?"

"అర్ధరూపాయి."

బండివాడికి డబ్బులిచ్చి యింట్లోకి వెళ్ళింది. దొడ్లోనించి బిందెతో నీళ్ళు తెస్తున్న పనిపిల్ల, ఆశ్చర్యంగా చూస్తూ అలాగునే ఉండిపోయింది.

"ఎవరు మీరు?" అని అడిగింది.

"వెంకమ్మగారెక్కడ ?" శాంతమ్మ ప్రశ్నించింది.

"ఆ గదిలో—"

శాంతమ్మ గదిలోకి వెళ్ళింది. మంచం మీద కూర్చొని జపమాల త్రిప్పుతున్న వెంకమ్మ, అర్ధనిమీలిత నేత్రాలతో చూసింది. తరువాత జపమాల ప్రక్కను పెట్టింది. కళ్ళు మసకలు కావడంవల్ల మనిషిని పూర్తిగా గుర్తించలేకపోయింది. మెల్లగాలేచి దగ్గరకు వచ్చింది.

"అత్తా" శాంతమ్మ దుఃఖపూరిత కంఠ ధ్వనితో పిలిచింది.

"ఆఁ" అంటూ వెంకమ్మ ఆశ్చర్యంగా చూసి, శాంతమ్మగా కంఠధ్వనివల్ల గుర్తించి హఠాత్తుగా ఆలింగనం చేసుకొని "దేవుడు నీకూడా ఇదేగతి తెచ్చాడమ్మా-" అని రోదనస్వరంతో అంది.

"రామ్మా-రా-చాలా కాలానికి చూశాను. ఎప్పటి కప్పుడే వద్దామనుకుంటే మాయదారి రోగం రానిస్తేనా ?" అంటూ ఆయాసం దగ్గుతో కాస్త తటపటాయించి లోపలికి చూస్తూ "ఒసే తులసీ...ఎక్కడ చచ్చావే" అంటూ మళ్ళీ శాంతమ్మకేసి చూసి "దిక్కుమాలినదాన్నయిపోయాను పనిముండలమీద ఆధారపడవలసి వచ్చింది. ...ఏమిటాలాగే నిలబడ్డావ్...కూర్చో" అంటూ వెంకమ్మ కూర్చుంది. ఎదురుగా ఉన్న మంచంమీద బిడ్డలతో శాంతమ్మ కూర్చుంది.

"ఏవీ నారత్నాలు" అంటూ బిడ్డల కేసి ఆసక్తిగా చేయి చాపింది వెంకమ్మ.

ఆమె ఆయాసం, ఆమె మాటలు, వైఖరి చూస్తున్న రామూ, రవికూడా బిక్కుబిక్కుమంటూనే ఉన్నారు. అంచేత ఆమె చేతిలోకి వెళ్ళలేదు సరికదా ఇద్దరూ భయంగా వెంకమ్మ కేసి చూస్తూ తల్లినికౌగలించుకున్నారు.

"ఎందుకమ్మగారూ!" అంటూవచ్చింది పనిపిల్ల. "వాళ్లకు కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళిచ్చావా ?" మళ్ళీ కాస్త ఆయాసపడి "వట్టి మొద్దుముండ...లేమ్మా ఎండలో వచ్చావు...బిడ్డలకు కాస్త తిండిపడేయి... ఎందుకే ఆలా చూస్తావ్...దిక్కులేని వాళ్లకు దేవుడేదిక్కు...తల్చుకుంటే వచ్చి వొరిగేదేమీ లేదమ్మా" అంటూ వెంకమ్మ లేచింది. శాంతమ్మకూడా లేచింది.

శాంతమ్మ అసలు జరిగినదాన్ని తలవడల్లేదు. తలిచినా లాభంలేదనిఆమెకు తెలుసు. అయితే జరగబోయే జీవితం ఏలాగాఅనేది మాత్రం ఆమె ఆలోచన. తన నోటితో ఒక్కమాటకూడా ప్రస్తావించడానికి అంత ఆయాసంలోకూడా వెంకమ్మ అవకాశం యివ్వలేదు. అయితే అవకాశం లేదనే భయంమాత్రం శాంతమ్మకు లేదు. కాగా వెంకమ్మ ఆదరణ కొంత ఆశాజనకంగానే వుంది, అంతా గది విడిచారు.

వెంకమ్మ, వట్టి బోళామనిషి అని చూడ్డంతోనే, మాటలు వినడంతోనే సులభంగా నిర్ణయించేవాళ్ళున్నారు. అయితే అమాయకురాలని ఒక్కళ్ళూ ఒప్పుకోరు. కాని ఆమె జీవితం ఆఖరిభాగంలో గడచిన ఆరు సంవత్సరాలూ మంచి అనుభవజ్ఞురాలుగా చేశాయి. హోటలు పెట్టిన కొద్ది

కాలంలోనే, అనేక తరహాల మనుష్యుల రాకలతో, పెట్టే తిండికన్నా మాటల ద్వారా, మనుష్యులను ఎంత సంతృప్తి పర్చవచ్చో ఆమె బాగా గుర్తించింది. ఇతర హోటళ్లకన్నా ఈమె పెట్టేతిండిలో విశేషపదార్థాలు ఏమీ లేకపోయినా, ఆదరణద్వారా మాత్రం ప్రతివాళ్ళూ "వెంకమ్మ చాలామంచిది" అని అనకుండా ఉండలేకపోయేవారు. అయితే దేనివల్ల ఆమె మంచిదిగా చలామణీ అవుతూ వచ్చిందో ఆమాటకారితనాన్ని మాత్రం ఇంత ఆయాసంలో కూడా ఆమె విడిచిపెట్టకపోవడం శాంతమ్మకు ఆశ్చర్యంగానే తోచింది.

ఆరాత్రి రాము అప్పుడే నిద్దట్లోపడ్డాడు. వేరే మంచంమీద రవి పండుకున్నాడు. శాంతమ్మ రవిని జోకొడుతూ మంచంమీదనే కూర్చొని ఉంది.

వెంకమ్మ మెల్లగా గదిలోకి వచ్చింది.

"ఇంకా పడుకోలేదమ్మా" అంది.

పరధ్యానంగా ఉన్న శాంతమ్మ వెనక్కి తిరిగి చూసింది. మెల్లగాలేచి గోడను ఆన్చి ఉన్న వాలుకుర్చీ మంచం దగ్గరగా వేసింది.

కుర్చీలో కూర్చొని, తీక్షణంగా వెంకమ్మ శాంతమ్మ మొగంలోకి చూసింది.

"శాంతా"జాలిగా ధ్వనించిందా కంఠం.

చిన్నతనాడు అందరూ శాంతమ్మను ఆలాగే పిలిచేవారు. ఏదో మరచిన మధురమైన పిలుపు ఎంత కాలానిగ్గానో మళ్ళీ వింది.

"బ్రతకలేనని భయపడేవాళ్ళు, బ్రతికుండి కూడా చచ్చిన వాళ్లకన్నా ఏంఘనం కాదు...చూడు! నేను ఆడదాన్నే - ఆయన పోయిన మొదట్లో ఈలాగే ఆలోచించేదాన్ని...అయితే తినడానికి లోటు లేదని, తిండిపెట్టేవాళ్లతో సూటి పోటు మాటలు పడ్డం ఎంత కష్టమో నువ్వు గ్రహించే వుంటావ్."

ఇప్పుడు కొంత దగ్గొచ్చింది వెంకమ్మకు. దగ్గిన తర్వాత కాస్సేపు ఆయాసపడింది.

"హోటలూ..." శాంతమ్మ అడగబోయింది. మాటలో పూర్తిభావం ఆమె మనస్సులోనే ఉండిపోయింది. వెంకమ్మ ఆయాసపడుతూనే చేయిపెట్టి ఆమెమాటను ఆపు చేసింది.

"హోటలు ... మొదట్లో పెట్టినప్పుడు కారాలూ మిరియాలూ నూరాడుగా మా మరది...అన్నం అమ్ముకోడం పాపమట... వంశమర్యాద పోతుందట. అబ్బే! నేను లెక్క చేయలేదు. నాలుగురాళ్లు సంపాదించడం తోనే - నా ఒదినగారంటూ తెగ తిరిగాడు. అతనికొడుకుని నేనేగా పెంచి పెళ్ళిచేసింది. ఒక్కపూట భోజనం తప్ప ఒక్క కానీ యిస్తేనా ఊహూ! అందుకే శాపనార్థాలు పెడుతూ చచ్చాడు. పెంచిన విశ్వాసంలేకుండా అవెధవకూడా, దూరమయినాడు ..ఏమ్మా నిద్దరొస్తుందా"

"లేదు" శాంతమ్మ ఏదో అడగాలనుకుంటుంది. కాని అడిగినతర్వాత సమాధానం ఏమిస్తుందోననే భయం ఆమెలో ఉన్నట్లుగా ఆమె అడగడానికి భయపడి లక్షణాలు గుర్తిస్తే తెలుస్తుంది.

"చిన్నా. .న్న..."

నిద్దట్లోరాము కలవరించాడు. వెంకమ్మ అటుచూసింది. దగ్గుతో కలసిన నవ్వు నవ్వింది.

"వెధవకు చిన్నాన్నదగ్గర చేరికా?"

"ఔను"

"పడుకోమ్మా! నిద్దరొస్తున్నట్లుంది" మెల్లగా కర్ర ఆధారంతో లేచిందివెంకమ్మ.

శాంతమ్మకు నిద్దర రావడ ల్లేదు.

"అత్తా"

వెంకమ్మ వెనక్కి తిరిగింది.

"మళ్ళీహోటలు పెడితే!"

వెంకమ్మ ఈమాటతోఒక్కసారి కఫంతో కూడిన నవ్వునవ్వింది.

"హోటలు .....మాటలమ్మా!...నీ నోటిలో నాలుకే లేదు...నే నసలు పని ముట్టుకోలేను...ఇదిగో శాంతా! మగవాళ్ల ఆధారంలేకుండా హోటలు నడపడమంటే..." ఉదాహరణ ఏం చెప్పాలో ఆ సమయంలో ఆమెకుతోచలేదు. కాస్సేపాగి వెంటనే ఏదోతట్టిన దానిలాగు "నే నొక్కదాన్నే చేసేననుకో-" అని ఊరుకుంది.

"అంతకష్టమా?" నిజంగా సంశయ నివృత్తికోసమే అడిగింది.

"అమ్మో నీ వల్ల కాదు తల్లీ! అయినా నాకంత తెంగిందుకే - నేను బ్రతికుండగా నీ బిడ్డలకూ నీకూ యేమీ లోటు లేదు. చాలా..." మళ్ళీ దగ్గి..."పదేళ్ళ క్రితం ఏలాగున్నావో యిప్పుడూ ఆలాగే వున్నావే నీలో ఏమీ మార్పు లేదు... పిచ్చితల్లీ" మళ్ళీ నవ్వూ దగ్గుతో ఆగది నిండించింది వెంకమ్మ.

బహుశా శాంతమ్మకు ఈ మాటతో ఒక పెద్ద సమస్య పరిష్కరింపబడి, సంతృప్తి పడి ఉంటుందని వెంకమ్మ భావించి వెళ్ళిపోయి ఉంటుంది. కాని శాంతమ్మమనస్సు నిజంగా వెంకమ్మ గ్రహించలేదు. ఆమె తిండికోసం బ్రతకడంలేదు. తిండికోసమే బ్రతికేటట్లయితే తిట్లు కూడా ఒక ఆహారంగానే తీసుకుంటూ తన స్వంత యింటిదగ్గరే ఉండేది. కాని తనకాళ్ళమీద నిలబడి జీవించగలిగే స్త్రీపై హిందూ సంఘం ఏలాంటి అభాండాలు వేయడానికి సిద్ధపడుతుందో అనే సంగతికూడా విస్మరించలేదు. అయితే పరిశుద్ధ హృదయంతో తాను కష్టపడ్డ డబ్బుతో తిని జీవించే సంతృప్తిముందు ఇవన్నీ నిలకడలేని నీడలు మాత్రమే అని ఆమె భావన. ఏలాగయినా బిడ్డల భవిష్యత్తుకోరి తానొక నిలకడైన జీవనభృతిని అన్వేషించాలి. ఈ నిర్ణయంతోనే మంచం మీద పడుకొని బిడ్డను హృదయాని కద్దుకొని కళ్ళుమూసింది శాంతమ్మ.

## 3

మళ్ళీ వెంకమ్మ హోటలు తెరిచింది. ఈవార్త చాలామందికి ఆశ్చర్యం కలిగించింది. అందుచేతనే కొద్దిరోజుల్లోనే పూటకూ ఏభైవిస్తళ్ళు లేచే పరిస్థితికి వచ్చింది హోటలు.

శాంతమ్మ పట్టుదలతో, ఆమె పెట్టుబడితోనే, వెంకమ్మ పేరుతో హోటలు నిర్వహింపబడుతోంది.

కొద్దిరోజుల్లోనే శాంతమ్మ అనేకరకాల మనుష్యులు రావడం చూసింది.

"పూట కెంత?"

"ముప్పావలా?"

"అబ్బా!"

ప్రశ్నిస్తూనే వెర్రిగా శాంతమ్మకేసి చూశాడు. ఆమె ఆ చూపులో ఏదో భావాన్ని గుర్తించి లోపలకు వెళ్ళిపోయింది.

మరొకరోజు విస్తరిదగ్గర కూర్చున్న పెద్దమనిషి గోడప్రక్కగా ఒదిగి నిలబడ్డ శాంతమ్మ నుద్దేశించి ఇలా అన్నాడు.

"ఇంత ఘోషా అయితే హోటలెల్లా పెట్టావమ్మా- రా! కొంత పెరుగొడ్డించు."

శాంతమ్మ వచ్చి పెరుగు పోసేటప్పుడు మెల్లగా మళ్ళీ యీలా గన్నాడు.

"వట్టి భోజనమేనా, పడుకోడానికి కూడా చోటు ఉంటుందా?"

ఆమె క్రోధంగా అతనికేసి చూసింది. పట్టనట్టు బిగ్గరగా నవ్వి—"నీకు తెలీదా! పెద్దపెద్ద హోటళ్లలో భోజనం పెట్టి గదులు కూడా యిస్తారులే" అన్నాడు.

ఆమె మాట్లాడలేకపోయింది.

ఒకనెల గడిచింది. రోజురోజూ శాంతమ్మ మనస్సు ఈ వృత్తిపట్ల విముఖత పొందడం ప్రారంభించింది. అలా జరుగుతుందని వెంకమ్మకు తెలుసు.

వెంకమ్మపేరు జపిస్తూనే గుమ్మం పక్కన అత్తరుసాహెబ్, శాంతమ్మను చూసి "హెంతి పెద్దకూతుర్ హుందీ. హెంకమ్మగార్" అంటూ తిరిగి సమాధానం అందుకోకుండానే కాళ్ళు కడుక్కొని వెళ్ళి గదిలో కూర్చున్నాడు.

శాంతమ్మవచ్చి విస్తరివేసింది. రాము వచ్చి కాళీగ్లాసు పెట్టాడు.

# ★ దత్తత ★

"అరె మీది బిడ్డా ఏమిటే?" అని సాయేబు అడిగాడు. ఔనన్నట్లు తల పంకించింది.

"అరె రాజా వెలుగు...వహ్వా! మంచి జాతక పురుషుడు హవుతాడు' అని వచ్చిన భాషలో అభినందించాడు.

ఆ క్షణంలో శాంతమ్మ హృదయం పుత్రానురాగంతో నిండిపోయింది. సాహెబ్ అన్న మాటల్లో పూర్తిగా ఉత్ప్రేక్ష లేదు. రాము మొగం చూస్తేనే ప్రతివాళ్ళనూ ఆకర్షించగల మంచి లక్షణాలున్నాయి. రంగుకూడా బాగా ఎరుపు.

రవి తండ్రిపోలిక చామనచాయ. ఓ మూల కూర్చుని చూస్తున్నాడు.

అన్నం వడ్డించడం పూర్తికావడంతోనే నోట్లో ముద్దపెట్టుకుంటూ గోడప్రక్కగా ఉన్న రవిని చూసి, బొంగురుగా ఉన్న కంఠంతో "అరె బచ్చా! తుమ్ కౌన్" అని అరిచాడు.

రవి కోపంగా చూసి వేలుపెట్టి జాగ్రత్త అన్నట్లు ఆడించాడు. సాహెబ్ అరచేతి నేలకేసికొట్టి "వారేవా! హేలుపెట్టి సూపుతావ్" అంటూ భోజనందగ్గర్నుంచి లేవబోయాడు. రవి భయపడి బేరుమన్నాడు.

శాంతమ్మ రవిని తీసుకొని లోపలకు వెళ్ళిపోయింది. కాస్సేపయిన తర్వాత "అరె వమ్మా" అంటూ బిగ్గరగా సాహెబ్ కంఠం వినిపించడంవల్ల తిరిగి వచ్చింది.

"చారూ లేదూ"

"ఉంది."

చారు వడ్డిస్తోంది. తెల్ల కళ్ళతో ఆ ముస్లిం శాంతమ్మకేసి చూసి "అరె మొగం చూస్తే......హెంత అందంగా వుంది" అన్నాడు.

శాంతమ్మ కంగారుతో చారుపాత్ర విడచింది.

"అరె హల్లా" అంటూ భయంగా లేచి చిందులు త్రొక్కడం ప్రారంభించాడు. శాంతమ్మ తప్పుకొని కంగారుగా వెంకమ్మ దగ్గర కొచ్చింది.

"ఏం జరిగింది?" వెంకమ్మ ఆత్రంగా అడిగింది.

"చారుగిన్నె జారిపోయింది" భయంగా సమాధానం చెప్పింది.

పెద్దగా అరుచుకుంటూ సాహెబ్ గదిలోకి వచ్చాడు. వెంకమ్మ మాటలద్వారా అతన్ని శాంతింపచేసి పంపించివేసింది.

శాంతమ్మ పాత్ర విడవడం బుద్ధిపూర్వకంగా చేయనిమాట వాస్తవమైనా - అతని నోటినుండి వెలువడ్డ మధుపాన పరిమళానికి, అతడు ఏలాంటి పనైనా చేయగలడేమో ననే అదురుమాత్రం చేతిని కంపింపచేసింది.

"ఎందుకు విడిచిపెట్టావ్?" వెంకమ్మ శాంతమ్మకేసి చూసింది. వెంకమ్మ మళ్ళీ ఆశ్చర్యంగా చూస్తూ "ఏడుస్తున్నావేం?" అని అడిగింది.

"నేనిక వడ్డన చేయలేనమ్మా. ఎవర్నన్నా మాట్లాడు" కళ్ళు తుడుచుకుంటూ అక్కడనించి తన గదిలోకి వెళ్ళిపోయింది శాంతమ్మ.

వెంకమ్మ మ్లాన హాసంచేసి "నేను మొదట్లోనే అనుకున్నాను" అని గొణుగుకుంది.

మరునాటినుంచి శాంతమ్మ కేవలం వంటల బాధ్యత మాత్రమే తీసుకుంది. వెంకమ్మ అంత నీరసంలోనూ, శ్రద్ధగా డబ్బులు వసూలుచేయడానికి గుమ్మంలో వేసిన ముక్కాలు పీటమీద కూర్చుంది.

వడ్డనచేయడానికి మరో మనిషిని కుదిర్చింది వెంకమ్మ. అయితే ఆ మనిషి పూర్వ చరిత్ర ఎరిగున్నవాళ్ళు ఎవరన్నా చూస్తే మళ్ళీ గుమ్మం ఎక్కరనే ఆదురు వెంకమ్మకు లేకుండా పోలేదు. వేరే గత్యంతరం లేక ఆకులు తీసే వెంకినే, శుభ్రమైన బట్టలుకట్టి ఆపనికి పురమాయించింది.

వంటచేస్తున్నంతసేపూ శాంతమ్మ మనస్సు దుఃఖభారంతో కృంగిపోతూనే వుంది. రెండుమూడుసార్లు అప్రయత్నంగా కళ్ళవెంట నీళ్ళుకూడా కారాయి.

"అమ్మా! చిన్నాన్న" అని రాము గంతులు వేసుకుంటూ వచ్చి చెప్పాడు.

శాంతమ్మ కళ్ళు తుడుచుకొని, రాముని చంకను వేసుకొని చావిట్లోకి వచ్చింది.

"బాగున్నావా వొదినా"

అంతవరకూ నిలబడే వున్న చంద్రయ్య పలకరించాడు. శాంతమ్మ రాముని క్రిందను దింపి, చావిడిలో ఉన్న చిన్న మంచం వాల్చింది.

"కూర్చో"

చంద్రయ్య మంచంమీద కూర్చున్నాడు. ఇంతవరకూ వెంకమ్మ భోజనానికి వచ్చిన మనిషిలాగునే అనుకుంది. కాని శాంతమ్మను వరసపెట్టి పిలవడంతోనే, మరిదిగా గుర్తించింది.

"ఏంబాబూ! మాయదారిమతి! మర్చిపోయాను నీపేరు" అని అడిగింది వెంకమ్మ.

"చంద్రయ్య అని పిలుస్తారు"

"రామయ్య తమ్ముడివేగా"

"అవును"

అని సమాధాన మిచ్చి నిలబడి చూస్తున్న శాంతమ్మకేసి చూశాడు.

"సుభద్ర బావుందా?"

"ఆఁ" ఏదో విరక్తిగా ధ్వనించిందా కంఠం.

"చంద్రయ్యా! ఒకమాట అడుగుతాను నీకు కోపం రాదుకదా!" అని స్థాయిగా ప్రశ్నించిన వెంకమ్మను చూసిన శాంతమ్మకు భయంవేసింది. ఆమె మాటల ధోరణి ఎప్పుడు ఏరూపంలో వస్తుందో ఈ కొద్దిరోజుల అనుభవంతో శాంతమ్మ గుర్తించింది.

"మాటలు తర్వాత మాట్లాడవచ్చు—భోజనానికి లే బాబూ" దగ్గర చేరిన రవి తల నిమురుతూన్న చంద్రయ్య "భోజనానికేంలే వొదినా" అని వెంకమ్మకేసి చూసి "అడగండి" అన్నాడు.

అప్పుడే వేసివచ్చిన తాలింపు వాసన మాడుతున్నట్లు గొట్టుకొట్టింది. శాంతమ్మ కంగారుగా లోపలకు వెళ్ళింది.

"చచ్చిన అన్నగారితోబాటే ఒదిన గార్ని బిడ్డలనూ వొదిలేయడం మంచిదేనా?" అంది వెంకమ్మ.

"ఒక్కనాడు కూడా నాకా ఉద్దేశమే లేదు...ఆమెకు యిష్టం లేకనే వచ్చేసింది" అని ముక్తసరిగా సమాధానం చెప్పాడు.

అప్పుడే భోజనానికి వచ్చిన యిద్దరు వెంకమ్మకు డబ్బు లిచ్చి లోపల గదిలోకి వెళ్ళారు.

"నేను నమ్మను" వచ్చే నవ్వును ఆపుకుంది. మళ్ళీ ఆయాసంగా "రామయ్య బ్రతికుండగా, అతని చేతులమీదుగానేగా నీ పెళ్ళి చేసింది......ఆరోజుల్లో ఒక్క కాని సంపాదన నీదుండేదా?...ఈ పక్షపాత బుద్ధే ఆయనకుంటే - ఈనాడు నువ్విలా సుఖంగా జీవించగలవా..."

"అత్తా" అప్పుడే కంగారుగా లోపల నుంచివచ్చిన శాంతమ్మ కాస్త కఠినంగానే పిలిచింది. వెంకమ్మ ఆమెకేసి చూసింది. కళ్ళ మసకలో కూడా శాంతమ్మ కళ్ళలో అరుణరేఖలు చూడగలిగింది వెంకమ్మ.

"ఒదినా! ఆమె అన్నదానిలో అబద్ధమేమీ లేదు......" మెల్లగా మంచంమీద

పత్రిక చదువుతున్న భార్య, భర్తతో:- ఈవార్త విన్నారా?...అదేదో వూళ్లో ఎవరో మూగవాణ్ణి గాడిద, మూతి పళ్లు రాలేటట్లు తన్నేసరికి, వాడికి అమాంతం మాటలు వచ్చేశాయట!

భర్త: అల్లాగా! మొగాడికి మాట రావాలంటే గాడిదే తన్నక్కర్లేదు. పెళ్లాం పుట్టింటి కెళ్లితే చాలు నిజానికి!!

నుంచి లేచాడు. అతని మొగంపై కోపచ్ఛాయలు స్పష్టంగా చూడగలిగింది శాంతమ్మ.

"వెంకమ్మగారూ! అన్యాయంగా నేను నా వొదినను యింట్లోంచి వెళ్ళిపొమ్మన్నాననే నింద, మీరు వేసినంతమాత్రాన నాకు బాధ లేదు. కాని విధవ యింట్లో ఉండలేక వీధిపడి హోటలు పెట్టింది అని నలుగురు అనుకుంటే, తప్పనిసరిగా బాధపడుతున్నాను." అప్పటికే అతని మొగం కాస్త ఎర్రబడింది.

వెంకమ్మ ఇరుకున పడ్డట్లయింది. ఏమన్నా మరిదిని నాలుగు ఝాడిస్తే శాంతమ్మకు తృప్తిగా ఉంటుందనుకొని ప్రారంభించిన వాచాలత్వం - శాంతమ్మకే బాధాకరంగా ఉంటుందని అనుకోలేదు.

"నాకెందుకమ్మా" ఒణుకుతో ధ్వనించిన కంఠంతో అని, కష్టంగా కర్రఆధారంతో లేచి భోజనాలు చేసే గదిలోకి వెళ్ళిపోయింది.

చంద్రయ్య ఎవర్నించయినా సమాధానం అందుతుందా అని ఆశించాడు. కాని అలా జరగలేదు. అడుగు జేబు లోనించి మనీపర్సు తీసి "ఇల్లు అమ్మివేశాను. తనఖా బాకీపోను ఆరువందలు మిగిలింది" అంటూ పర్సులో కాగితాలు తీస్తున్నాడు.

"ఎందుకమ్మాలి?" కొంచం బాధ్యతగా, చనువుగా అడిగింది.

"ఎందుకమ్మకూడదూ - తెలీక అమ్మివేశాను...ఇల్లు నాదనుకునే వాళ్ళు యింట్లోంచి వెళ్ళిపోయార్లు. ఇక నాకు బిడ్డా? పాపా? బంగారయ్యగారి వసారాకు మూడురూపాయలు అద్దె ఇచ్చి ఉంటున్నాను"

వందరూపాయలనోట్లు మూడువైకి తీసి,

"తీసుకోవదినా——"

"నాకక్కర్లేదు" ఆమె మాటల్లో బాధ ధ్వనించింది.

"నీకక్కర్లేకపోయినా - నా అన్న మొగంచూసి - ఇచ్చేబాధ్యత నాకుందని, ఇస్తున్నాను...తీసుకోవడం మాత్రం తప్పదు"

"దూరంగా ఉన్నా - ఇంకా బాధ పెట్టాలనా" ఆమె కళ్లల్లో నీళ్ళు తిరిగాయి.

ఈమాటకు చంద్రయ్య ఆశ్చర్యపడ్డాడు.

"దగ్గిరుండగా నిన్ను బాధపెట్టేనా?"

"బాధగాకపోతే ఇదేమిటి? కొంప ఎందుకమ్మాలి? ఎవరమ్మమన్నారు?" ఇక ఆమె మాట్లాడలేక పోయింది.

శాంతమ్మకు కేవలం కొంపమీద ఉండే మమకారం గాకపోయినా - మరది అద్దె కొంపలో ఉండటం ఆమెకు ఇష్టంలేదు. అయితే ఆమె సద్భావం, భాషారూపంలో మాత్రం వ్యక్తం కాలేదు. చంద్రయ్య మళ్లీ మంచంమీద కూర్చున్నాడు. గట్టిగా నిట్టూర్చాడు.

"ఒదినా! నువ్వు మళ్ళీ వస్తావనే నమ్మకముంటే యీ పని చేయలేకపోయేవాణ్ని - కాని నీ సలహా లేకుండా యీ ధైర్యం చేయడం తప్పేనని యిప్పుడనుకుంటున్నాను..." అని మెల్లగా లేచి, కళ్లు తుడుచుకుంటున్న శాంతమ్మ దగ్గరగావచ్చి,

"ఇంటిమీద వేయి రూపాయలు అప్పున్నదన్న సంగతి నీకు తెలుసుగా ఒదినా?"

"తెలుసు."

"నా జన్మలో ఆ అప్పు తీర్చగలననే నమ్మకం లేకనే యీపని చేశాను...నీకు ఇది ఇంత దుఃఖకారణ మాతుందంటే; ఈ పని చేసేవాణ్ణి కాను" కాస్సేపాగి ప్రాధేయతగా "డబ్బు తీసుకో వొదినా" అడిగాడు.

"ప్రస్తుతం నే నేమీ కూటికి మాట్లేదు. డబ్బు నీదగ్గరే ఉంచు."

"నేను కూటికి మాడినా - పరుల డబ్బు నాదగ్గర ఉంచనని నీకు తెలుసుగా."

'పరులు' అనే పదం అనాలోచితంగా వదలిపెట్టేనని చంద్రయ్య అనుకోకపోయినా - ఆ పదంమటుకు శాంతమ్మ హృదయానికి శరాఘాతంలా తాకింది.

"అవును..పరాయిదాన్నే!" దుఃఖాన్ని బాధగా కంఠంలో దాస్తూ "ఏది?" అని చేయి చాచింది.

చంద్రయ్య డబ్బు యిస్తూ - "ఈ వాదు చాలు వొదినా? ఇంకా కొంపకూడా అమ్మకొని ఒదెనగారి కివ్వకుండా కాజేశాడనే నింద పొందలేకనే ఇంతదూరం వచ్చి యిస్తున్నా" డబ్బు యిచ్చాడు.

"వెళతా వొదినా."

"భోజనం?"

"అక్కర్లేదు."

పై కండవాతో కళ్లు తుడుచుకుంటూ వెళ్ళిపోయాడు చంద్రయ్య.

ఆరోజు రాత్రి జపతావళం త్రిప్పుతూన్న వెంకమ్మదగ్గరకు శాంతమ్మ వచ్చింది. వెంకమ్మకు ఆ సమయంలో శాంతమ్మ రావడం ఆశ్చర్యంగానే తోచింది.

"ఏం శాంతా?"

"చంద్రయ్య యిల్లు అమ్మిన బాపతు మూడువంద లిచ్చేడు."

"నేను విన్నదేగా."

వెంకమ్మకు ఆ సంగతి తెలుసు అనే సంగతి శాంతమ్మకు తెలీక ఆ ప్రస్థాపన ఎత్తలేదు. కాని తాను చెప్పబోయే విషయానికి నాందిగా పైమాట ఎత్తింది. అయితే వెంకమ్మ యిచ్చిన సమాధానం, మళ్ళీ శాంతమ్మను మాట్లాడేటట్లు చేయలేదు. కాస్సేపు నిశ్శబ్దంగానే ఉన్నారు.

"నీదగ్గ రుంచత్తా."

"ఎందుకూ?"

"రేపటినించి హోటలు పని..."

హఠాత్తుగా నవ్విన వెంకమ్మ నవ్వు వెనక, పెనువేసుకుంటూ వచ్చిన దగ్గు - ఇక శాంతమ్మను మాట్లాడనివ్వలేదు. అయిదు నిమిషాలపాటు దగ్గుతో పోరుచేసి, ఆయాసంగా వగురుస్తూ——"నే నిప్పుడేమీ మాట్లాడలేను శాంతా......నీ కేదిష్టమైతే అదే చేయి." జపమాల ప్రక్కగా పెట్టి మంచంమీద వాలింది వెంకమ్మ.

(ఇంకావుంది)

# పజిలు ప్రభావం

"ఘస్టుప్రైజు నాదే చూసుకో" అన్నాడు మోహన్ తల పైకెత్తి చూస్తూ.

దాదాపు రెండు గంటలనుంచీ టేబుల్ దగ్గర తిష్టవేసి క్రాసువర్డు పజిలుతో కుస్తీ పట్టూన్న మోహన్ వరస చూస్తూనే వున్నారు శీనయ్యగారు. పడకకుర్చీలోంచి వచ్చిన ఆ గంభీరమైన చిరునవ్వే దానికి సమాధానం. ఆ నవ్వులో పజిలువేసేవాళ్ల అమాయికత్వంచూసి జాలీ, ప్రైజు ఎల్లాగూ రాదనే విశ్వాసం, ఇటి స్వల్పవ్యామోహాలకి అతీతుణ్ణిసుమా అని హెచ్చరించే పెద్దరికమూ, 'ఇటువంటివి చాలా చూసేంతే ఏం క్రొత్తకాదు' అనే భావన ప్రకటించే అనుభవజ్ఞతా, యిమిడి వున్నాయి. ఆ చిరునవ్వు సైలెన్సరున్న రివాల్వరులోని బులెట్టులాగ మోహన్‌ని దూసుకుపోయింది.

"ఆ, మన మొహాలకి ఘస్టుప్రైజు కూడానూ" అంటూ సావిట్లో గడపదగ్గర చతికిలబడింది తల్లి లలితాంబగారు. పైకి అలా అన్నా లోలోపల ఆవిడకీ ఆ ప్రైజు రావాలనే వున్నట్లు నవ్వుతో కూడిన ఆవిడ వెడల్పు మొహమే చెప్తోంది. లోపలి ఉత్సాహాన్ని అణచుకుందుకు ప్రయత్నిస్తూ, "ఎంతేమిట్రా ప్రైజు?" అన్నది.

"లక్షరూపాయలు" అన్నాడు మోహన్ కళ్లల్లో పడే క్రాపు తల ఆడింపుతో పైకెగరవేస్తూ.

రూపాయిబిళ్లకంటె పెద్దవిగా కళ్ళుపెట్టి అడిగింది చిట్టి "అన్నయ్యా మరి నాకేం కొని పెట్టావు ప్రైజొస్తే" అని.

"నీకేం కొనను. అంతా నాకే" అన్నాడు మోహన్ కొంటెగా.

"చూశావా అమ్మమ్మా, అన్నయ్య ఏమంటున్నాడో" అంటూ గారాబంగా ఫిర్యాదు చేసింది చిట్టి సావిడి అవతల నడవలో వత్తులు చేసుకుంటూన్న వెంకాయమ్మగారితో.

"ఏమిట్రా అది" అంది ఆవిడగారు.

"నీకు తెలీదమ్మా. ఇవన్నీ ఇంగ్లీషు మాటలు. సరిగ్గా వేస్తే లక్షరూపాయిలొస్తాయి" అని కేకేశాడు మోహన్ చూస్తున్న డిక్షనరీ మూసేసి.

ముసలమ్మగారికేం అర్థం కాలేదుకాని రూపాయిలమాట వినగానే మొహం యింతైంది.

"నేను చెప్పలేదటమ్మా, మోహన్ మాంచి ప్రయోజకుడవుతాడనీ. లక్ష్మీకళ వాడి మొహంలో ఉందర్రా"

అని ప్రారంభించింది వెంకాయమ్మగారు.

"అయితే ఎప్పుడు తెలుస్తుందన్నయ్యా ప్రైజు సంగతి?" అని అడిగింది చిట్టి.

"రెండు మూడు వారాల్లో తెలుస్తుందిలే చిట్టీ, నెగ్గిన వాళ్ళకి - అంటే మనకి" - ఛాతీ విరిచి కుడిచేతి బొటనవేలుతో తనవేపు చూపుకుంటూ, "టెలిగ్రాం వస్తుంది. టెలిగ్రాం" అన్నాడు మోహన్.

"మరి టెలిగ్రాంవస్తే కొస్త తమాయించుకుని జాగ్రత్తగా చూడండేం, లేకపోతే ఆ ఆనందంతో గుండె ఆగిపోతుంది" అని హెచ్చరించాడు మోహన్ ఎంతో సీరియస్‌గా మొహం పెట్టి.

"అవునర్రా, ఆమధ్య ఇల్లాగే ఎక్కడో బోలెడంత డబ్బు ప్రైజువస్తే టెలిగ్రాం చూసుకోగానే గుండె ఆగిపోయిందిట ఎవరికోగాని. పేపర్లోకూడా వేశారుట" అన్నారు లలితాంబగారు.

ఇంతలో శంకరం హడావిడిగా వచ్చి మడత మంచంమీద చుట్టబెట్టివున్న పరుపుల మధ్య పడకవేసి "ఆలివరుట్విస్టు" చదవటం మొదలెట్టేడు.

"చిన్నన్నయ్యోయ్ మరి మోహనన్నయ్యేం పజిలు వేస్తున్నాట్ట. మనకి లక్ష రూపాయి లొస్తాయిట" అని చెప్పేసింది శంకరంతో చిట్టి ఉండబట్టలేక.

"అప్పుడే వచ్చేసినట్టే సంతోషిస్తోంది పిచ్చిపిల్ల" అంది లలితాంబ ఫలితం ఏమవుతుందో తనకి ఇదివరకే తెలిసినట్లు, మనస్సులో మట్టుకి లక్షరూపాయిల రాశిని ఊహించుకుని మురిసిపోతూ.

"పోస్టుచేసి యిప్పుడే వచ్చేస్తా" నంటూ ఒక్క గంతేసి చెక్కేయాడు మోహన్. ఇంట్లోని అందరి హృదయాలూ అతనికి సాయం వెళ్ళేయి.

పోస్టాఫీసు ఆరోజున మోహన్‌కళ్లకి ఇంద్రభవనంలా కన్పించింది. "ఆఫీసు ఎంత బావుందో తను ఇన్నాళ్ళూ చూడేలేదు" అనుకున్నాడు పోస్టుమాస్టర్ని "ఒక కవరు యివ్వండి సార్" అని బరువుగా, గంభీరంగాఅన్న ఆమాటల్లో ఎంతో బ్రహ్మాండమైన పని నెత్తిన పెట్టుకున్న ఎంతో బాధ్యత గల పెద్దమనిషినిసుమా అనే హెచ్చరిక వుంది.

కవరు తీసుకుంటూన్న మోహన్‌కి పోస్టుమాస్టరూ, గుమాస్తాలనీ చూస్తుంటే జాలివేసింది 'పాపం అంత చిన్న జీతాలతో ఎంత బండచాకిరీ చేస్తున్నారో' అని. కవరు తీసుకుని మిగతా తతంగం పూర్తిచేసి జాగ్రత్తగా కవరు అంటించి, ఊడిపోతుందేమో అని నాలుగుసార్లు దాన్ని గోడకి పెట్టిగుద్ది, అక్కర్లేనప్పటికీ ఎందుకేనా మంచిదని ఇంకో అణాబిళ్ళ ఎక్కువ అంటించి, పోస్టుబాక్సులో చెయ్యి ఎంతవరకూ లోపలకి పోతుందో అంతవరకూ పోనిచ్చి కవరు అందులో వదిలేశాడు మనస్సులో "జై మహంకాళీ" అనుకుంటూ.

"అమ్మయ్యా" అని ఒక్క నిట్టూర్పుతో ఎంతో బరువు తీరినట్లు, ఆఖరిరోజు యూనివర్సిటీ పరీక్షలకి రాసేసి లాడ్జికి వచ్చేసే విద్యార్థిలా ఫీలవుతూ వెళ్లిపోయాడు మోహన్ అమాయకంగా నించున్న ఆపోస్టు బాక్సులో తనుపడేసిన అమూల్యవజ్రాన్ని తలచుకుంటూ.

"అమ్మా, పోస్టులో వేసేసేనే" అన్నాడు యింటికివచ్చి. అప్పటికే ఇంట్లో వాళ్ళంతా ఆదుర్దాగా చూస్తున్నారు ఇంకా మోహన్ రాలేదేమా అని. లలితాంబగారు శంకరాన్ని ఓసారి వెళ్లి చూసి రమ్మంటున్నారు పోస్టువాళ్ళేమైనా అల్లరి పెడుతున్నారేమో అని. పుస్తకంలో మునిగిపోయిన శంకరం కదల్లేదు. "ప్రైజొస్తే డబ్బుమూట్టుకు రావాలి. కొస్త చూసి రమ్మంటె చూడకూడదూ" అంటూంది చిట్టి అప్పుడే ఏడుపు దోరణి పెట్టి.

"పెట్టెలో సరిగ్గా వేశావురా నాయనా" అన్నారు లలితాంబగారు.

"ఓ, అంతా అనుకూలంగానే జరిగింది" అన్నాడు మోహన్.

"ఏదో అవుతుంది. మనం చేయాల్సిన పని పూర్తిఅయినట్లే. ఇంక భారం దేవుడిది"

అన్నారు లలితాంబగారు చిట్టి తల దువ్వుతూ.

"ఈ పాటికి మనకవరు రైల్లో వుంటుంది" అన్నాడు మోహన్ కవరు గమ్యస్థానాన్ని చేరేవరకూ చేసే ప్రయాణాల్ని ఊహించుకుంటూ.

"అన్నయ్యా, మరి అన్నీ రూపాయిలొస్తాయిగదా ఏం చేస్తావురా" అంది చిట్టి ఊలుముక్క తల్లికి అందిస్తూ.

"నేను పారిస్, లండన్, న్యూయార్కు— అన్నీ చూసేస్తాను. స్టీమరూ, విమానం ఎక్కి ప్రపంచం అంతా తిరిగేస్తాను. బ్రహ్మాండమైన సూట్లు వేస్తాను. ఇంకా ఫారెక్ లో పెద్ద పెద్ద దొరల హోటళ్ళలో మకాంవేస్తాను సినిమాలూ, డాన్సులూ, హాలీవుడ్డూ ఓ, ఒకటేమిటి మన జీవితం యింక మీదట అంతా హైక్లాసులో నడిచిపోతూంది" అంటూ ఇంక మాట్లాడలేకపోయాడు మోహన్ రాకెట్టు కంటె స్పీడుగా తన మెదడులో పరుగెత్తే ఆలోచనల్లో ఆశల్లో ఉక్కిరి బిక్కిరియై.

"ముఖ్యంగా ఓ యిల్లు కొనుక్కుందాం" అని సలహాయిచ్చేరు లలితాంబగారు. ఇంటి ముందు అరుగుమీదీ తడి కక్కేసీ, పెరట్లో పడిపోయే దడికేసీ చూసి చీదరించుకుంటూ, మళ్ళీ "ప్రైజెల్లాగూ వస్తుంది. యింక ఈ ఇంటితో ఋణం సరి" అని మనస్సులో సమాధానము చెప్పుకుంటూ.

"నా సుకోష్టం ఏం ఖర్మమమ్మా. హాయిగా మీ యిష్టంవచ్చిన ఫామసులో కట్టుకోక" అన్నాడు దర్జా పద్దుగా, అప్పుడే వచ్చి కూర్చుంటూన్న శంభన్న. (శంభన్న గారంటే మోహన్ వాళ్ళ ఫామిలీ మనిషి లెండి. రోజూ వాళ్ళింటికి కనీసం ఓ మారేనా వచ్చి, కబుర్లు చెప్పి, శీనయ్య గారి తంబాకు సేవించి, చక్కాపోతాడు)

"నేనైతే ప్రపంచంలోని పెద్దపెద్ద రచయితల పుస్తకాలన్నీ కొనేసి చదివేస్తాను. లండన్ వెళ్ళి షేక్స్పియర్ వుండినయిల్లూ, లండన్ టవరూ, అమెరికాలో వాషింగ్టన్ స్క్వేరూ, పారిస్ లో రివల్యూషను జరిగిన వీధులూ — నేను పుస్తకాల్లో చదివిన చోట్లన్నీ చూసేస్తాను" అన్నాడు శంకరం మంచం మీంచి

"కాస్త నా మొహాన్ని కూడా పడేయండర్రా, కాశీ రామేశ్వరాలు సేవించుకు వస్తాను." అంది వెంకాయమ్మ

"నేను ఎంచక్కా రిబ్బన్లూ, గాజులూ కొనుక్కుంటానుగా" అంది చిట్టి చంక లెగరేస్తూ, 'చొక్కా తొడుక్కోవే' అనే తల్లిమాట వినకుండా, ముడివిడి జారిపోయే లాగూ కేసేనా చూడకుండా.

"ఏరా మోహన్, ఏమిటి కథ? ఇంట్లో అంతా మాంచి హుషారుగా వున్నారే?" అన్నాడు అప్పుడే వచ్చిన మోహన్ క్లాసుమెట్ విశ్వం.



"వచ్చేప్రైజుతో ఏం చెయ్యటమా అని ఆలోచిస్తున్నాం'
"కష్టపడి పనిచేసి పొట్టనింపుకోవాలి గాని వెర్రి ఆశలూ, ఊహాలూ ఎందుకురా భాయి......"

"పజిలు వేశానురా, వచ్చే ప్రైజుతో ఏం చెయ్యటమా అని ఆలోచిస్తున్నాం" అన్నాడు మోహన్

"కష్టపడి పనిచేసి పొట్టనింపుకోవాలి గాని ఈ వెర్రి ఆశలూ, ఊహాలూ ఎందుకురా భాయి పెబ్బుకోసం ఇలా గంగవెఱ్ఱు లెత్తి పోతున్నారే" అన్నాడు విశ్వం

"ఒరేయి నువ్వు వొర్తి కమ్యూనిస్టువురా, నీకు తెలీదు వూరుకో" అన్నాడు మోహన్ ఇంగ్లాండు అమెరికాలలో తను చూడబోయే ప్రదేశాల్ని ఊహించుకుంటూ.

"ఏదో ఈ పదివేల అప్పూ తీరితే అదే చాలు అంతకంటే ఆశలులేవు" అన్నారు ఆఖరికి శీనయ్యగారు కూడా చిరునవ్వులేని బాధ్యతాయుతమైన మొహంతో.

"ఇంతకీ వాళ్ళదగ్గర అంతడబ్బు వుండొద్దూ యివ్వటానికి" అని సందేహించారు లలితాంబగారు.

"ఏమండోయి, లలితాంబగారూ, మీకా భయమక్కర్లేదు. ఇల్లా పజిలు [illegible]

# ★ పజిలు ప్రభావం ★

అతులకొద్దీ వుంటారు" అని ధైర్యం చెప్పేడు విశ్వం.

.....................

పజిలు తెలిసే రోజు దగ్గిరైనకొద్దీ ఇంట్లో వాళ్ళంతా ఆదుర్దాపడటం మొదలెట్టేరు. టెలిగ్రాం ఫ్యూన్‌కోసం ఎదురు చూస్తున్నారు. ఆఖరికి ఆ ఫ్యూన్ పెళ్ళాం కూడా వాడికోసం అల్లా ఎదురు చూచియుండదు. ఆఖరికి రోజూవచ్చే పోస్టుమాన్ కేసి అనుమానంగా చూసేవారు ఇంకా ఏ ఉత్తరమేనా ఇవ్వలేదూ అని.

ఓ రోజున టెలిగ్రాంమునిషి రానే వచ్చాడు. ఇంట్లో అంతా ఒక్కసారి అంగ పట్టుకుని వీధిగుమ్మం కాసేరు. వాడు ఎదురింట్లో ఇచ్చేసి చక్కాపోయాడు. లలితాంబగారికి ఆవేళ వాడిమీద వచ్చిన ఆగ్రహం చెప్పటానికి వీల్లేనిది. ఒక్కొక్కప్పుడు పోస్టువాడు ఇంటిముందు ఆగకుండా సైకిలుమీద వెళ్ళిపోతూంటే వాడిమీద విరుచుకుపడేది లలితాంబ తన మనస్సులో తప్పంతా వాడిదే అయినట్లు.

"అమ్మా పోస్టువచ్చిందే" అన్నాడు మోహన్ ఓ రోజున. ఒక్క గంతేసింది వీధిగుమ్మం కేసి లలితాంబ. వెంకాయమ్మ పెరట్లో తులసికోట దగ్గిరనుంచి వీధిగుమ్మం కేసి ఆత్రంగా చూసింది తను చేసే పూజ మానేసి. శివయ్యగారుకూడా పడక్కుర్చీలో కేర్లబడ్డ పోజు లోంచి ముందుకు వంగేరు. ఇంతా చేస్తే అది పెళ్ళి శుభలేఖ. అందరూ తెల్ల మొహాలు వేశారు.

"ఎప్పుడూ పిళ్ళకి పెళ్ళిళ్ళే. ఇంకేం పనిలేదు" అని శుభలేఖ పంపించినవారిని విసుక్కున్నారు లలితాంబగారు.

ఆఖరికి పోస్టుమానుకే మొహమాటం వేసేది "పిళ్ళకేం ఉత్తరం ఇయ్యలేకపోతున్నాను కదా" యని.

"నా తప్పేం లేదమ్మా, ఎవరూ మీకు రాయటం లేదు. నేనేం చెయ్యను" అనే ధోరణిలో మొహంపెట్టి సిగ్గుగా సైకిలు తొక్కుకు పోయేవాడు.

మోహన్ తరచు పోస్టుఆఫీసుకీ టెలిగ్రాఫ్ ఆఫీసుకీ వెళ్ళి అడిగేవాడు "మాకేమేనా వచ్చిందా" అంటూ. ఒక్కొక్కప్పుడు మోహన్‌కి రాత్రి నిద్రపట్టేది కాదు. కలలో పజిలుమాటలుదొర్లిపోయేవి.

అప్పులవాళ్ళని "ఇంకోవారం ఓపిక పట్టండి. అంతా అణాపైసలతో తీర్చేస్తాను" అని పంపించేవారు శివయ్యగారు తమ దృష్టిలో అదేమంత పెద్ద బాకీ కానట్లు.

లలితాంబగారు రోజూ గట్టిగా లక్ష్మీస్తవం స్తోత్రంచేస్తూ పూజలుచేసేవారు.

చిట్టి వీధిలో రిబ్బన్లవాడికేసి చూసి నవ్వుకునేది. "ఇంకెన్నాళ్లు తిరుగుతావు లేవోయ్, ఇంకోవారంలో అన్నీ నేనే కొనేస్తాను" అన్న ధోరణిలో.

శివయ్యగారు ఓ రాత్రివేళ ఉలిక్కిపడేవారు. అర్ధంటు టెలిగ్రాం ఏవేనా వచ్చిందేమో అని.

.........................

అనుకున్న రోజు వచ్చింది. నెమ్మదిగా నీరసంగా పేపరు చేత్తో పుచ్చుకొని మోహన్ వచ్చాడు. సావిట్లో గడపదగ్గర కూర్చున్న లలితాంబగారూ, పడక కుర్చీలోని శివయ్యగారూ, పడవలో ఫలహారం తింటూన్న వెంకాయమ్మగారూ, మడత మంచంమీద శంకరం, మూడు చక్రాల సైకిలుపైని చిట్టీ - అందరి మొహాలు ఏమైందన్నట్లు ప్రశ్నించేయి ఆత్రంగా బాధగా, ఆశతో.

"ఏడు తప్పులొచ్చాయి నాన్నా. అయినా వాడి సొల్యూషనునికిఅర్థంలేదు." అంటూ కుర్చీలో కూలబడ్డాడు మోహన్.

"నేను చెప్పలేదూ మన మొహాలకి ఆ మాత్రం అదృష్టం కూడానా" అని సాగదీస్తూ వంటింట్లోకి వెళ్ళిపోయారు లలితాంబగారు.

టీపార్టీ అడుగుదామని వచ్చిన విశ్వం, ఇల్లుకట్టుకుందుకు స్థలం అమ్మకానికి వుందని చెప్పడానికివచ్చిన శంభన్నా ఇంట్లో వాళ్ళమొహాలు చూసి మాట్లాడకుండా వెళ్ళిపోయారు.

వీధిలోంచివెళ్ళే పోస్టువాడికి ఆశ్చర్యం వేసింది తన్నిల్లా ఎందుకు వదిలేశారా అని. ★

# ★ ఆర్థికశాస్త్రమూ - నీతిశాస్త్రమూ ★

కామేశ్వర్రావు నిద్ర లేస్తూనే - "యివ్వాళ తారీ ఖెంతన్నావు?" - అని భార్యవేపు చూశాడు అలవాటు చొప్పున. సుభద్ర అద్దం ముందు నుంచొని మొఖాన కుంకుమబొట్టు పెట్టుకొంటున్నది. సుభద్రకు క్యాలెండరు చూట్టం చేతకాదు. సూర్యకుమారి బొమ్మతో - ఒక నిలువు వరసన వారాల పేర్లూ, ఇంకో నాలుగైదు వరసల్లో అంకెలూ. ఈ వారాలకూ ఆ అంకెలకూ పొత్తు కుదర్చటం తనకు చిన్న తనంలో కొట్లమీది బడిపంతులు నేర్ప లేదు. తను తారీకు చెప్పవలసి వచ్చిన క్లిష్ట సమయం దాపురించినప్పుడల్లా - "అదుగో, ఆ యింగ్లీషు గళ్ళబడి (క్యాలెండరుకు వచ్చిన తిప్పలు) చూచ్చి తెలుగుది తెమ్మని ఎన్నిసార్లు మొత్తుకోనండీ?" అంటుంది. లేకపోతే - "మా నాన్నగారు నన్నే యిస్కూలు బడికి పంపలేదు సుమండీ. నేను చదివినరోజుల్లో యీ గళ్లూ బొళ్లూ ఏమీ లేవు. పెద్దబాలశిక్ష, సుమతీశతకం, బాలరామాయణం, ఎక్కాల పుస్తకంలో తిథులూ, తెలుగు సంవత్సరాలూ——". తనకు నిండా పాతికేళ్ళు లేకపోయినా, సుభద్ర తను చదువుకొన్న రోజుల్ని గురించి చెప్పేటప్పటి భావవత్తుల తాకిడికి, కామేశ్వర్రావుకు శ్రీరాములవారి వంశీయు డైన ఇక్ష్వాకు మహారాజూ, ఇండియా చరిత్రలో చైనా యాత్రికుడు పాహియానూ జ్ఞాపకం వస్తుంటారు. సుభద్ర పల్లెటూరి అమాయికత్వానికి అటువంటి ప్రతినిధిగా నిలుస్తుంది.

సుభద్ర కొంచెం ఆలోచించి - "నిన్న యిరవైరెండు అన్నారు గదండీ?" అన్నది.

"నీ మొహం. యివ్వాళ యిరవైఅయిదు. రోజూ అయితే కామేశ్వర్రావు నవ్వు కొనేవాడు. కాని అందుకు బదులుగా పక్కమీద దొర్లాడు. అటువంటి దొర్లిగింత లెప్పుడూ దివ్యజ్ఞానం ప్రసాదించటంకద్దు. అనుకొంటున్నాడు - "జేబులో దమ్మిడీ లేదు - ట్రాం ఎక్కడానిక్కూడా. ఎక్కడ తన ఆఫీసు - ఎక్కడి మైలా పూరు! ఈ నెల జీతాలు రాగానే ఎనభై రూపాయల అప్పుతీర్చాలి. జీతాలకు యింకా వారం రోజుల గడువున్నది. యిప్పటి కప్పుడే దమ్మిడీలేదు. ఏ నెల కానెల యిదే వరస——"

పేపరువచ్చి జ్ఞానమత్తును అరికట్టేసింది. "స్టెర్లింగు విలవ మారుతుందా ?" - యీ 'హిందూ' చస్తే హెడ్డింగులు మార్చదు గదా. "పశ్చిమ జర్మనీకి ప్రజాసత్తాక ప్రభుత్వం" (బ్రిటీషువాడు వేలుపెట్టిందల్లా ప్రజాసత్తాకమే అవుతుందిగా.) "వచ్చే నెలనుంచి జమీందారీల రద్దు——" ఆ తరవాత సినిమా పేజీ - "వనభంగిని పిక్చర్సు వారి గౌరీ గంగాసంవాదంలో నాయకి." వారఫలితాలు......ఆc......

## శ్రీ మునిపల్లెరాజు

కామేశ్వరరావు శిష్టాచారంగల కుటుంబంలోంచి వచ్చాడు. మద్రాసునగర జీవితంతో అది ఎక్కువ పోటీకి రాక పోయినా, తన పూర్వీకు లిచ్చిన సంపద - పాపభీతి - నీడలాగా తనను తరుముతుంటే, పార్టీలదగ్గర రూపాయి, రెండు రూపాయల లంచాలుగూడా పుచ్చుకోకుండా నిరాకరించటంవల్ల - ఆఫీసులో గణేష్ అయ్యర్లూ, ఆనందరావులూ తన్ను పిచ్చి పుల్లాయికింద కట్టేశారు. మీనన్‌తో తను మొన్న ఖచ్చితంగా అన్నాడు - "ఆగస్టు 14-1947 అర్ధరాత్రి లగాయతు లంచాలు పుచ్చుకొంటున్న వాళ్ళందరూ దేశ ద్రోహులే" నని. మీనన్ తెలివికలవాడు. ముందు కాళ్ళకు బందాలువేసే తెలివి. "ఆమాట నిజమేనయ్యా. కాని నువ్వు వాళ్ళను పీడిస్తున్నావా లేక వాళ్ళే యిస్తున్నారా అనేది ప్రశ్న. బల్లకిందుగా పార్టీ వచ్చి యిస్తున్నది - ఏదో నువ్వు వాళ్ల కొరిగించిన సహాయంచూసి. వద్దని తిరస్కరిస్తావా? అసలు...వచ్చిన తిప్పలు...మన జీతాలు చూడు —— ——" అదీ మీనన్ వరస.

కళ్లు కర్కాటక లగ్నంమీదికి పోయినై. తను కర్కాటకంలో పుట్టాడు——. అవి గండపెండేరీ దండధారణ బ్రహ్మచార్యస్య ద్వితీయ పుత్ర శ్రీ శ్రీ శ్రీ అపవాద భయంకర అనంతరామానుజ సిద్ధాంతి నామధేయస్యగారి వారఫలితాలు. - "వారం మొదట్లో దారా పుత్రాదులకు ఖాయిలా. తత్కారణంగా ధనవ్యయం. వారాంతంలో ధనాధిపతి...మంచి స్థానంలోకి మారటం వల్ల గాలిపాటుగా అధిక ధనలాభం. ఈ వారం స్పెక్యులేషన్లలోనూ, పోటీలలోనూ ఈ లగ్న జన్మస్థులకు చాలా లాభిస్తుంది." ఆ క్రిందనే పాశ్చాత్యజ్యోతిశ్శాస్త్ర పద్ధతి ప్రకారం :—— అదృష్టానికి - పచ్చరంగు, ఏడవ నెంబరు."

ఊఁ - యిటువంటి మంచి ముక్కలు యీ మధ్య తనెప్పుడూ చూడలేదు. తను పిలవకుండానే ఈలవచ్చింది. తను ఈల పాటలో రఘురామయ్య అంతటివాడు. మంచంమీదినుంచి తను కిందికి చిన్నసైజు హనుమంతులవారిలాగా దూకినప్పుడు, కొద్దిగా అంఘుసాక్ర్పత్యంలో, కాలు జారింది. "అదృష్టం అంటే యిలావుండాలి సుమా" అని తను ప్రకాశంగా అనుకొన్నాడు. సుభద్ర నోరువిప్పి చూచింది.

* * *

మొందటి తేది అక్టోబరు.

ఆఫీసులో మీనన్ తిరిగి ప్రత్యక్షం.

"మిష్టర్ రావ్! రేస్ సీజన్ ప్రారంభం రేపు శనివారం నుండీ"

"........ఓ.......... గుర్రప్పందేల మాటా?"

"ఎప్పుడైనా చూశావా యిదివరకు?" అని మీనన్ సిగరెట్ పొగ వూదాడు.

కామేశ్వర్రావు మద్రాసులో చూడని 'సావాయ్ హోటల్లాం'టి డజను వస్తువుల్లోనూ గిండికేసు కోర్సు (గుర్రప్పందేల ఆటస్థలం) ఒకటి. దానికి ప్రత్యేక కారణాలున్నై. రామ కవచం వారి అల్లుడు నాలు గొందల రూపాయల వుద్యోగం చేస్తూ గూడా దివాలా ఎత్తేట - యీ పందేలకు పోయి. ఒక్కసారి నెళితే చాలు...యిక

# ఆర్థికశాస్త్రమూ - నీతిశాస్త్రమూ

సైతాన్‌లాంటి పిచ్చి పట్టుకొంటుందని ఆయనే అనేవాట్ట. ఇదిగూడా జూదంతో సమానమే గదటండీ. కాకపోతే ప్రభుత్వం వారుగూడా దీనిమీద నిషా వెయ్యటం దేనికి?–నలుడూ, ధర్మరాజూ, తండ్రి చిన్నప్పుడు వల్లె వేయించిన వేదపాఠాలూ కామేశ్వరరావు స్మృతికి తట్టినై.

"ఎబ్బెబ్బె...! అటువంటి కబుర్లు నా దగ్గరలేవు. యీ పెద్ద జూదాలంటే నాకు మంట."

"ఓ క్ష! యింకేనా మిస్టర్ రావ్! మా ఆంధ్రులంటే పెద్ద ధైర్యం గలవాళ్ళని మేమంతా అనుకొంటూంటాం. చూసినంతలోనే ఏమైపోతుందోయ్ - అసలు నిన్ను జూదాలు ఆడమని నేనన్నానా. ఒకసారి నాతోవచ్చి చూద్దువుగాని అని నేనే పిలవబోతున్నా." అని మళయాళం బిడ్డ మీనన్ కనుబొమలు రెండుసార్లు పైకెత్తాడు.

ఆ మాట నిజమే. అంతేకాదు - ఆంధ్రులనే మాటకు కామేశ్వర్రావుకు ఉక్రోషం వచ్చింది.

"అయితే రేపుపోయి చూద్దాం పద"– అన్నాడు పళ్ళు సగం బిగించి. అప్పుడు తండ్రి జ్ఞాపకం వచ్చాడు. కాని మీనన్ సిగరెట్టు పొగతెర అడ్డం కట్టింది. ఆరోజే జీతాలు ముట్టడంవల్ల ఆ పల్చని తెరగూడా మాంఛి మందంగా కనిపించింది.

* * *

ఇంటికి వెళ్ళంగానే సుభద్ర తన మామూలు భణితిలో ఒక్క ముఖంపెట్టి "వాళ్ళు వచ్చి వెళ్ళారండీ." అన్నది.

"వాళ్ళెవళ్ళు?"

"వాళ్ళేనండీ - యింటివాడూ..."

కామేశ్వర్రావు గుండెల్లో రాయిపడ్డది. మూణ్ణెల్ల అద్దె బాకీ - 75 రూపాయలు. అన్ని బాపతులు కలిపి తన చేతికివచ్చిన జీతం నూటయిరవై రూపాయలు. ఈ పద్దు సంగతి తను బొత్తుగా మరిచిపోయినాడు.

"పాలవాడూ–" రోజుకు అర్థసేరు చొప్పున పదిహేనున్నర.

"చక్రయ్య శెట్టి–"

చక్రయ్యశెట్టిది పచారీ దినుసుల వ్యాపారం. నిజానికి శెట్టిది పాతబాకీ. రెణ్ణెల్లక్రితమే యిస్తానని తను చెప్పుకొన్నాడు.

"ఆ శెట్టివచ్చి నానా మాటలూ అని పోయాడు. మీరు రెణ్ణెల్లనించి ముఖం తప్పిస్తున్నారట... మీరు అయినా అదేమిటండీ... ఏనెలవి ఆనెల తీర్చక–"

సుభద్రకు ఆర్థిక శాస్త్రంలో ఏమాత్రమూ ప్రవేశం లేదు. సుభద్రను వంటలో తప్పితే యింకే విషయంలోనూ తను మెచ్చుకోలేదు.

"ఇదుగోనండీ - డాక్టరుగారి బంట్రోతు యీ చీటీ యిచ్చిపోయాడు."

చదువుకొన్నాడు. పిల్లవాడికిచ్చిన మందులకూ, సుభద్రకిచ్చిన నాలుగు యింజెక్షన్లకూ బిల్లు - పదహారు రూపాయలు. జీవితం నశ్వరమైనది. ఏ మొత్తమైనా అప గలదు గాని డాక్టరుగారి బిల్లు ఆపలేదు. ఈ డాక్టర్లున్నారే... వీళ్ళకు మానవజీవితాల మీద అంత దగ్గర అధికార సంబంధాలున్నాయి.

కామేశ్వర్రావు మనస్సుకు కొద్దిగా టెంపరేచరు వచ్చింది. చిత్తశాంతికోసం మెరీనా బీచివేపు వెళ్ళాడు.

'తన మనస్సులాంటి సముద్రం. తన

చాకీలవంటి అలలు. రాత్రివంటి నీళ్ళు... దుఃఖంలో గూడా కవిత్వం రాశినవాళ్ళు వున్నారట. కాని తన మాదిరిగా బీచి ఏడవటం లేదు, నవ్వుతున్నది. ఎత్తు మడమల బూట్లు వేసుకొన్న దొరసానులు గూడా నవ్వుతున్నారు. తమ ప్రియుల్తో రహస్యంగా మాట్లాడుకొంటున్నారు. వాళ్ళది ఎటువంటి జీవితం? తన బ్రతుకూ? బ్రతుకంటే చలనంలేని పెద్దశిలాగాదు. వేదాంతమూ గాదు. కలగూడా కాదు. దొరసాని జీవితంలో చలనాలు వున్నవా? అనుకొన్నాడు. ఉన్నా అవి ఎటువంటివో తనలాంటి బాకీల జీవితపు చలనాలు మాత్రం కావు. వేదాంతం వెనక బొంకవచ్చు. దాక్కోవచ్చు. కలల వెనక దాగుడుమూతలాడవచ్చు. మధురమైన బాధలు అనుభవించవచ్చు. కాని తన బాకీల జీవితానికి ఈ ఆనందాలేమీ లేవు.

కామేశ్వరరావుకు 'యిమోషన్' వచ్చింది. ప్రపంచం అంతా ఏకమై తన్ను నిర్దయగా, యీ బాకీల యజ్ఞవేదికకు బలిపశువుగా అంటగట్టింది. కళ్ళవెంట నీళ్ళు గూడా వచ్చాయి. గుండె బరువుగా కొట్టుకొన్నది. కంఠం కనబడని వస్తువులతో పెనుగులాడింది. సినిమాకు వెళ్తేనో... అక్కడ యీ యజ్ఞవేదికను, ఎత్తుబూట్ల దొరసానిని, డాక్టరుగారి బిల్లును కొంతసేపైనా మరిచిపోవచ్చు.

లేచాడు. రెండడుగులు ముందుకు వేశాడు. వెనకనించి ఎవరో కేకేశారు.

"కామేశం—"

వెంకట్రామయ్యగారు, తండ్రికి బాల్య మిత్రులు. సుభద్ర ఆయన్ను గురించి చెప్పవలసి వచ్చినప్పుడల్లా "అంకెల వుద్యోగి" అంటుంది. అంకెలతో వుద్యోగాలు నిర్వహించేది అక్కౌంటెంట్లు.

పిల్లా జెల్లా యోగక్షేమాలు అయిపోయినాయి. కందిపచ్చడి రుచులూ, ఆఫీసు విశేషాలు జరిగిపోయినై. వెంకట్రామయ్యగారు తను కదలకుండా తనను కదలనియ్యకుండా తాత్సారం చేస్తున్నారు. తనకు తెలుసు, ఎందుకో...ఆకలిలాగా సముద్రం హోరుమంటున్నది. తనకు తెలుసు - ఎందుకో.

"బాబాయిగారూ! నన్ను క్షమించాలి. మీవద్ద పుచ్చుకొన్న చేబదులు. యిదిగో... నిన్ననే వచ్చి యిద్దామనుకొన్నాను." జీతం కవరులోకి చేయిపోనిచ్చి మూడు పదుల నోట్లు అందించాడు. అసలు ఈ బాకీని తను లెక్కలో వేసుకోలేదు.

"దాని కేమిలేవోయ్" - అంటూ తండ్రిగారి ఆ బాల్యమిత్రులు కదిలిపోయినారు.

కామేశ్వరరావుకు ఆకలయింది. సినిమా దారి తప్పించి యింటికి వెళ్ళాడు.

పప్పుచారు వడ్డిస్తూ, అర్నెల్ల క్రిందటి ముచ్చటను తిరిగి ఎత్తింది సుభద్ర.

"మా నాన్నగారు కార్డు రాశారు..."

"ఆయన ఎప్పుడూ అవే రాస్తుంటాడుగా" - అన్నాడు మధ్యలోనే - "కవర్ల ఖరీదు పెంచారులే" యీ మధ్య.

"మీరు జవాబు వ్రాయరాయెను. ఆయన దిగులుపడి ఛస్తున్నారు. మీ కింత బింకం ఏమిటండీ? మీరు ఏ వుద్యోగం చేస్తున్నారో యింత ముక్క రాసి పారేస్తే నామోషీ వచ్చిందా?"

మామగారికి మగపిల్లల్లేరు. నలుగురూ ఆడసంతానమే. తనకూ ఆయనకూ అయిదేళ్ళాయె మాటపట్టింపువచ్చి. అంతకుముందు తను నిరుద్యోగంగా సికింద్రాబాదులో వుండేటప్పుడు నెలకు పాతికో పరకో... ఆమాట కొస్తే...యాభైదాకా ఆయనే సర్దేవాడు. ఆయనకు పెద్దల్లుడంటే అంత ప్రాణం. కాని ముసలాయనఒక్క పొరబాటు చేశాడు. తను అల్లుడికి డబ్బు పంపుతున్న సంగతి ఆనోటా యీనోటా వేశాడు. కామేశ్వరరావుకు నిజంగానే నామరదా వచ్చింది. తను మద్రాసువచ్చి యొకా యొక్కని వుద్యోగంలో ప్రవేశించాడు. మళ్ళీ తన దస్తూరీని మామగారికి చూపించలేదు. ముసలాయన అల్లాటప్పా ఆద్మీకాడు. ఘరానా మనిషి. అల్లుడు అలిగాడని తెలిసి గూడా, "వాడే తన పేర ముందు రాయాలి" అన్నపట్టులో వున్నాడు. కథ యిట్లా తిరిగినప్పుడు కామేశ్వరరావు, మామగారు రేడియో కొనుక్కునేందుకు, తన కూతురి పేరే పంపించిన ఐదొందల రూపాయీలు తిప్పి కొట్టించేశాడు.

"రాయకపోయినావా - మీ అల్లుడు నాన్‌గెజెటెడ్ ఆఫీసరు వుద్యోగం చేస్తున్నాడని."

"ఆ ఆఫీసేమిటో మీరే రాస్తే ఆయన ప్రాణం..."

"ఆయన ప్రాణాని కొచ్చిన ఫర్వా ఏమీలేదు."

సుభద్ర పమిటె చెంగుతో కళ్ళద్దుకొన్నది.

"పోనీ ఆ కార్డుమీద యింత అడ్రసన్నా రాసివ్వండి."

కామేశ్వరరావు మజ్జిగ పోసుకోకుండా విస్తరిముందునుంచి లేచిపోయాడు. హిందూ ధర్మపత్ని గనక సుభద్ర ఆరాత్రి ఎంగిలిచేయలేదు.

* * *

జీతాన్నీ, జీవితాన్నీ మూసిన కామేశ్వరరావు ఆరాత్రి నిద్రపోలేక పోయినాడు. చివరకు భగవద్గీతకోసం గాలించాడు. ఆ గ్రంథం కనిపించలేదు. మళ్ళీ ఆలోచనల్లో పడ్డాడు. తండ్రిగారి వేదాంతం తనకు సరిగ్గా అతకలేదు. తనకు మృత్యువంటే భయం. వెనక - జీవితంలో భయపడవలసిందల్లా ఒక్క మృత్యువే అనుకొనేవాడు. ఇప్పుడు మృత్యువుకన్నా చల్లనైనదీ, నల్లనిదీ, విషాదపూరితమైనదీ అయిన యింకో విషయాన్ని వస్తువును చూశాడు - బాకీలు ... అప్పులు ... తను ఆఫీసులో, వీధిలో సంపాదించుకొన్న మర్యాద, బంధుమిత్రాదుల్లో అంచనా వేసుకొంటున్న తన గౌరవం - ఏమైపోతాయ్ - యీ డబ్బు చిక్కుల్లో? తన కిక లేవా - బ్రతుకులో తీపిదనమూ, గృహంలో శాంతి, ఇల్లాలి ఆరోగ్యమూ, బిడ్డడి భవిష్యత్తూ, కలలూ, కోరికలూ...?

కామేశ్వరరావు నిరాశను 'ఎనలైజ్' చేసుకొంటున్నాడు. యథార్థాన్ని గాదు నిరాశను. తమకు కలిగే ప్రతిదుఃఖానికీ, ప్రళయానికీ, జరిగే ప్రతి అన్యాయానికీ తమ కర్మఫలాన్ని నిందించుకొనే హిందువుల శతాబ్దాల వేదాంతం, అతని కణకణాల్లో అణువు అణువుల్లో అతికివుండి అందుకు అడ్డం వచ్చింది.

రేపు తను యింటివాణ్ణీ, పాలవాణ్ణీ, చెట్టినీ, డాక్టరునూ చూడలేదు - మళ్ళీ

## ★ అర్థిక శాస్త్రమూ - నీతి శాస్త్రమూ ★

ఒకటపతారీకున స్తేతప్పితే. వెంకట్రామయ్యగార్ని తను తన వెనకటి గర్వంతో తిరిగి పలకరించలేదు. ఖళ్ళున తెల్లవారింది."— అయ్యో - పిల్లవాడికి పాలడబ్బా అయిపోయింది" అన్నది సుభద్ర.

* * *

కామేశ్వర్రావు ఆఫీసులో కూడా పని చేయలేదు. మోచేతులు టేబిలుమీద పెట్టి, అరచేతులు బుగ్గలకు ఆనించుకొని, తెగిపోయిన ఆలోచనల్ని పొడిగిస్తున్నాడు.

1. పేపరు ఆపేసెయ్యాలి. పాలకు మూడు

స్వర మిగులుతుంది - యిందువల్ల.

2. పనిమనిషిని తగ్గించెయ్యాలి.

3. పాలు అర్ధశేరునుండి పావు శేరుకు కోత.

4. కాఫీకి స్వస్తి.

5. ఆఫీసులో కిల్లీలకు సోడాలకుగూడా.

6. టెన్నిస్ రాకెట్ అమ్మెయ్యాలి.

7. అప్పులు తీసుకోగూడదు. లేనప్పుడు మాడటం నేర్చుకోవాలి.

ఎనిమిది... తొమ్మిది ... పాయింటు తర్వాత పాయింటు రాసుకుంటూ పోయాడు. పేపరూ, కాఫీ, పాలూ, గుడ్డలూ అతనికి మానవ జీవితంలో దౌర్బల్యాలుగా కనిపించినై. భోగాలు గాదు దౌర్బల్యాలు. అంతా ముగించి కింద ఒక వాక్యం వ్రాశాడు - "కంచే చేను మేస్తున్నది." మధ్యాహ్నం యింటినుండి తెచ్చిన టిఫిన్ బంట్రోతుకిచ్చి ఆ చీటిని యింటికి పంపాడు.

"రావ్! ఏ ప్రపంచంలో వున్నావ్?"

మీనన్!

*   *   *

రేసుకోర్సుమీద సినిమా స్టార్లనుండి, రెవెన్యూ ఆఫీసు బంట్రోతులదాకా కనిపించారు కామేశ్వరరావుకు. రేసుకోర్సంతా కుబేరుడి పెళ్ళి పందిరివలె వుంది - అన్ని రకాల సిల్కు చీరలు, అన్ని ఫాషన్ల సూట్లు.

ప్లీడరుగుమాస్తా వెంకటరత్నంగారు పలకరించారు. వెంకటరత్నంగారిది తక్కువ హోదా వుద్యోగమయినా ఆయన్ను తెలీని వారు చాలా తక్కువమంది. బజార్లలో ఎరిగినవాళ్లందరితోనూ తన కూతురి పెళ్ళికి కట్నం యివ్వలేకపోతున్నానని గద్గదిక స్వరాల్లో చెప్పుకుంటూ ఆయన అపారమైన సానుభూతి సంపాదించుకొన్నాడు - పాపం. వాళ్ల ఆఫీసరుగూడా నల్లకళ్ళజోడుతో చేతులో గుర్రాల పుస్తకంతో పచార్లు చేస్తున్నాడు. చాలా తెలిసిన మొగాలు వీపుమీద తట్టినప్పుడు రావు మొదట్లో సిగ్గు, లజ్జలతో మెలికలు తిరిగాడు. మీనన్ పక్కనే వున్నాడు - "నీకెందుకంత భయం? ఇరవయ్యో శతాబ్దమంతా యిక్కడే వుంది, చూద్దువుగాని" అన్నాడు. అవును, ఆమాట నిజమే.

మీనన్ ప్రతివిషయమూ చెప్పాడు విపులంగా - ప్రతివస్తువునూ వినయంగా చూపించాడు. "టిక్కెట్లన్నీ ఎలెక్ట్రిసిటీతో నడపబడుతూన్న యంత్రాలమీద అచ్చు కొట్టియిస్తారు. కూడికలూ, తీసివేతలూ అన్నీ యంత్రాలే చేస్తాయిట. జాకీల్లో వీళ్ళు వీళ్ళు ఘట్టివాళ్లు. వీళ్ళువీళ్ళు అప్రెంటిస్ జాకీలు. ఈ గుర్రాన్ని ఫలాని మహారాణిగారు యిన్నివేలకు కొన్నారు. ఆ గుర్రాలకు ట్రైనరు ఫలాని నవాబుసాబ్. అదిగో, ఆ బోర్డుమీద గెలిచిన గుర్రాల నెంబర్లు. గెలుపు టిక్కెట్లు మార్చుకొనేది యిక్కడ. ప్లేస్ టిక్కెట్లు అక్కడ. ఒక్కొక్క గుర్రంమీద ఎన్నెన్ని టిక్కెట్లు అమ్ముడు బోయినాయో ఆ ఎలెక్ట్రిక్ బోర్డు చూపిస్తుంది."

మీనన్ ఋగ్ర విజ్ఞానయంత్రంలాగా కనిపించింది రావుకు.

"అందరు శాస్త్రి వాగన్నల్లాగా నేను యీ పిచ్చి అంచనాలు వెయ్యను సుమా. గెలిచే గుర్రాల సంగతి నన్నడుగు." అని అన్నాడు చివరకు.

ఒకసారి కామేశ్వరరావు అడిగాడు — "ఆ బక్క గుర్రంమీద అంత డబ్బెందుకు తగలేస్తావ్? ఆ గుర్రంకన్నా మంచివి అన్ని వుండగా? " — జూదగాళ్ళ అంతర్యాలు ఎల్లాంటివో బొత్తుగా తెలీనివాడు గనక.

"పోతే పోతుంది. దానికి పెద్ద విచారమేమిటి? కాని వస్తే పెద్ద మొత్తం. ఆ కొండకు యీ దారం కట్టి పట్టు బడదాం. అసలు ట్రిక్కు చూస్తుండు - నా బక్క గుర్రమే గెలవాలి." అన్నాడు - మీనన్, ఒకవిధమైన చూపు చూసి.

"గుర్రప్పందేలు ఒకప్పుడు రాజరాజుల పోటీల ఆటలు. ఇప్పుడట్లాగాదు. ఈ రేసింగును నడిపేవి పెద్దపెద్ద క్లబ్బులూ, ట్రస్టులూ దేశమంతటా ఏర్పాటయినాయి. వాళ్లకింద అంతులేని సిబ్బందిగూడా. మిల్లు యజమానులూ, మహారాజులూ, సీమ దొరలూ, జమీందారులూ, షేర్ మార్కెటు బ్రోకర్లూ, సినిమా ప్రొడ్యూసర్లు వీళ్ళందరూ ట్రస్టుల్లో సభ్యులు. వీళ్ళకు తోడు గుర్రాలయజమానులూ, గుర్రాల ట్రైనర్లూ, జాకీలు యిక్కట్లూ. యిదంతా పెద్ద లోకనాశనం సంఘం. ఎవరిపాట ఏరోజున ఎక్కువగా వుంటే వాళ్ళ గుర్రాలు గెలుస్తుంటాయ్. అంతేగాదు. యిప్పుడు గుర్రాలకు మదమెక్కించి, పిచ్చి పరుగు పరిగెత్తించే యింజెక్షన్లు వున్నాయి. గుర్రాలకు ఎక్కువ ట్రైనింగు యివ్వటం, తక్కువ యివ్వటం మనకు కనబడదు. పైకి చూస్తే తంచకల్యాణి. పరిగెత్తేప్పుడు మీరాసాయిబు మునలి దున్నపోతు. జాకీ చూస్తే చావు బతుకుల్లో పోట్లాడుతున్నట్టుగా, కొరడాతో గుర్రాన్ని బాదుతూవుంటాడు. కాని నిజానికి జరిగేదేమిటనుకున్నావ్? గుర్రం మూల తిరుగుడులో వెనకబడ్డానికి చేసే ప్రయత్నమే అదంతా. ఈ బుక్కీగాళ్లున్నారే - వీళ్ళు - ఒక్కొక్కసారి లంచాలిచ్చి ట్రైనర్లనూ, జాకీలను కొనేస్తారు. ఆరోజున ప్రజను బాగా దోపిడీ చేస్తారు - మంచి గుర్రాలను వెనక్కు పట్టించి, సాధారణంగా దోపిడిలో ముఖ్య భాగం యీ క్లబ్బులదీ, ట్రస్టీలదీ."

కామేశ్వరరావు యీమాటలు వినటంలేదు. అతడు మీనన్ టిక్కెట్టు కొన్న బక్కగుర్రం గెలవటం చూస్తున్నాడు. ఓడిపోయిన దొర జాకీలను, నవాబు గుర్రాలను చూస్తున్నాడు. ఆ దెబ్బతో మీనన్ నూట ఏభై రూపాయలు గెల్చుకున్నాడు. నోటిలో తియ్యని సిలీవా వూరింది కామేశ్వరరావుకు. నలువేపులా చూశాడు. అక్కడి మనుషులందరూ ఏదో వూనినట్లుగా అటూ యిటూ పరుగెత్తుతారు. కేకలు వేసినా అంతే. ఆవేశం వూనిన కేకలు. ఆ వుత్సాహానికి హద్దులూ, పొలిమేరలూ లేవు. భూకంపం వచ్చినా ప్రజ ఇట్లా గోల చెయ్యరేమో. ప్రతివాడికీ పట్టాభిషేకం జరిగినా అంత ఎత్తుగంతులు వేస్తారని అతనికి నమ్మకం కలగలేదు. ఒక జూదగాడు తనకు పూర్వశితో పెళ్ళయినట్లుగా నవ్వుతున్నాడు. ఆ తిరునాళ్లలో తనూ ఒక పుత్సవిగ్రహమై, ఆ పూజారుల్లో తనూ ఒకడై పోయాడు. శిష్టాచార సంపన్నుల సాంప్రదాయం గల కామేశ్వరరావు.

*   *   *

సుభద్ర ఎదురుచూసింది. పిల్లవాడి పాల సెబ్బా సిన్ననంగా అయిపోయింది. వట్టి పాంపీసనే హొద్దుట్నుంచీ చీకుతున్నాడు.

(59- వ పేజి చూడండి)

ఫుట్‌బాల్ ఆటలో ఏ వూరివాళ్ళు ఎక్కువ సమర్థులనే విషయంమీద గ్రిగ్ స్పోర్ట్సుకువచ్చిన అనేక స్కూళ్ల తాలూకు జట్టుకుర్రాళ్లు ఒకసారిగా వాదించుకొంటున్నారు.

"మా వూరివాళ్ళు యముఆటగాళ్ళు" అన్నాడొక వూరి కుర్రాడు.

"మీ వూరివాళ్ళు యముఆటగాళ్లయితే మా వూరివాళ్ళు యముళ్లే" అన్నాడు యింకోవూరి కుర్రాడు.

# నయ్యా...!

"మా అమ్మ తలంటి పోసుకుం టోంది; వచ్చేస్తుంది వది నిముషాల్లో. అందాకా అలా కూర్చోండి."

పొట్టి కుర్రాడు... సొట్ట బుగ్గలు... లంబో దరంతో ఏం చెప్పాలో తోచకుండా నాలుగు దిక్కులు గాభరాగా చూచి దక్షిణ వేపు వాకిలి పక్కగా కుర్చీలో చతికిల బడ్డాడు గోపాలం. గోపి అంటారు అంతా.

ఎదురుగ్గా పదిహేనేళ్ళ పిల్ల. నుంచుంది తన పెద్దకళ్ళను మరింత పెద్దవిగా చేసి చూస్తూ. రాజ్యం కోమాలు.

వాళ్ళక్క చెప్పింది. "ఇదిగో చూడు గోపీ. వాళ్ళూ గిరుపోయి పిల్లను చూసిరా. వాళ్ళు తొందరపడుతున్నారు. పదిహే నేళ్ళ పిల్లకి. ఎన్నాళ్ళుంటారు పెళ్ళిచెయ్యకుండా. నువ్వు సరేనంటే సిద్ధం. ఉత్తరం రాశాతే. ఎదురు చూస్తూం టారు..."

ఈ అమ్మాయినేనా.

తొట్టు లేసుకున్నాడు.

ఎంచక్క. నా కొజోరే పెళ్ళాం.

"ఇంటా బయటా జంటకవులవలె..."

లోపల పాడుకున్నాడు ఈలేసుకుంటూ.

రాజ్యం చూసింది.

పెళ్ళికొడుకు కొంటె నవ్వు. ఉత్తరం వచ్చిందిగా.

ఇవాళో రేపో అని రాసింది సీతమ్మ...

పేరు సీతమ్మ కోమాలు. సీతప్పంటుంది వాళ్ళమ్మ.

ఏం పేరో!... అంతోదయిరా!

నవ్వొచ్చింది లోపల.

అమ్మ వచ్చేలోగా...

ప్లాన్ వేసింది.

"ఏమంటారూ? సీతప్ప ఉత్తరం రాసింది.."

సగంలో అందుకు తలూపాడు.

కుర్చీలో సుండ్రంగా మరింత సుండ్రంగా బిగబడ్డాడు.

"మా అమ్మకు సీతప్పకు చిన్ననాటి స్నేహం. సీతప్పకు తెలీదు కోమాలు. పాపం..."

నాలిక కొరుక్కుంది.

"ఏమిటి..." బొడ్డుదగ్గరనుంచి పీకాడు దిమ్మరబోతూ, కీచుగా బాధగా.

"ఎరగదు ఎలా తెలుస్తుంది. సీతప్ప ఈ వూరినుంచి వెళ్ళి పదేళ్ళు కావొస్తుంది. నేనే చిన్నపిల్ల నప్పటికి. ఈ ప్రమాదం జరిగి ఏణ్ణర్ధం అయినా..."

"ఏమిటీ..." రెండుకళ్ళూ ఊడిపడేట్టు ఎగశ్వాస బట్టాడు.

నోటి ప్రక్కలనుంచి జారుతున్న చొంగ తుడుచుకోటం మరిచాడు.

"దక్షిణ వేపు వాకిలి... మీ ప్రక్కది... ఎందుకు తెరిచుందీ..." రాగం తీసింది.

"దక్షిణ వేపు వాకిలా... ఏ దక్షిణ వేపు వాకిలి ...ఆ... ఈ దక్షిణ వేపు వాకిలి. ఎందుకు తెరిచుందీ."

గుక్క పట్టాడు.

ఈ పిల్లకు పిచ్చా ఏమిటి!

**శ్రీ వఝ్ఝకృష్ణమూర్తి**

తనలో తను నవ్వుకున్నాడు.

చొంగ తుడుచుకోటానికి అవకాశం చిక్కింది.

"ఆ... ఏణ్ణర్ధం క్రింద ఈరోజునే ఈ వాకిట్లోంచి నాన్న స్నానానికి కాల్వ కెళ్ళాడు. వెధవకాల్వ. వొద్దంటూనే వుం దమ్మ. చెబితే వింటాడా నాన్న. స్నానం...స్నానం...వెధవస్నానం. బుల్లి తమ్ముడూ వెళ్ళాడు. ఇంటికి మళ్ళీ ఇద్దరూ చేరలేదు. కాలవలో మునిగిపో యారు. ఏమయినారో, ఎక్కడ తేలారో యిప్పటివరకూ జాడలేదు. అప్పటినుంచి అమ్మకు పిచ్చెత్తింది. పాపం. రాత్రిం బగళ్ళు ఆ తలుపు తీసేవుంచుతుంది. స్నానంచేసి నాన్నతో తమ్ముడొస్తాడని అమ్మ ఆశ. మునిగిపోయారంటే నమ్మదు. చెబితే వినదు. అదే ధోరణి. నాతమ్ముడూ పిచ్చిపాటలు పాడుతూ వుంటాడు. అమ్మ ధోరణి చూస్తూంటే ఎప్పుడో ఓరోజు నాన్న...తమ్ముడు...ఈ దక్షిణ వేపు వాకి ట్లోంచి స్నానంచేసి తిరిగొస్తారని..."

మధ్యలో ఆగిపోయింది. ఒక్కసారి ఒణికింది.

గోపాలానికి ముచ్చెమటలు పోశాయి.

"నాన్న విభూతిరేఖలు పెట్టుకుని... తడి కోల్లాయి నెత్తినేసుకుని... చేతిలో బుడి చెంబుతో... తమ్ముడు ఈలేసుకుంటూ ఎంకి పాటలు పాడుతూ ఈ వాకిట్లోంచి వచ్చేస్తారని... చేలోంచి పాడిగేదను దూడను తోలుకొస్తారని..."

దక్షిణ వేపు వాకిట్లోంచి బయటకు చూచాను. ఎదురుగ్గా గుడిసెలు, గుడిసెల పైన పచ్చగా చేలూ ఎంతో దూరంగా ఉప్పాడికాల్వ... జోరుగా... వడిగా...

ఎవరూ మాట్లాడలేదు.

క్షణంసేపు ఆ ఘోరాన్ని మనస్సులో నెట్టుకుని, బయటకు తెచ్చుకుని ఆలోచిస్తు న్నాడు గోపాలం.

అమ్మ వొచ్చింది చూడనేలేదు. తలంటి పోసుకుని జుట్టు పిడచవేసుకుని నీటిబిందు వులు పడుతుంటే వెనగ్గావచ్చి నుంచుంది.

"ఏం గోపీ. ఏం అంత కొత్తగా వున్నా వేం. సీతప్ప బాగుందా. ఎంత పెద్దవాడ వయిపోయావూ. మా రాజ్యం కబుర్లు చెబు తుందా. ఉత్తరం నిన్ననే చేరిందిలే. ప్రొద్దున్నే వస్తావనుకోలేదు...."

ఏక ధోరణిగా మాట్లాడింది. గోపా లానికి కొత్త ప్రాణమొచ్చింది.

"రాజ్యాన్ని ఎరగవూ. ఏం ఎరిగుంటా వులే. చిన్నపిల్ల మీరీ వూరునుంచెళ్ళేసరికి. ఆయన మన్నారులే. ఇప్పుడే కాల్వకు స్నానాని కెళ్ళారు. పిల్లాడూ వెళ్ళాడు. చాలా సేపయింది. వచ్చేవేళయిందిలే. నువ్వొస్తావని తెలుసు. ఇప్పుడే వస్తామని వెళ్ళారు..."

అదే ధోరణి...

గోపాలానికి వెర్రులెత్తింది. ఏంచేస్తాడు. పాపం. ఏణ్ణర్ధనుంచి కోమాల్సు. ఎంత బాధపడుతున్నదో. జవాబు చెప్పటానికి వీల్లేకుండా మాట్లాడుతున్నది.

రాజ్యంవంక చూశాడు.

'నేం చెప్పలా' అన్నట్లు చూచింది.

గట్టిగా ఊపిరి పీల్చాడు.

ఈ పాడు ప్రస్తావన మారిస్తే బాగుం టుంది.

"అక్క బాగానే ఉంది. ఉత్తరం రాశిందిటగా. మళ్ళీ తిరిగెళ్దామని ప్రొద్దుటే

బండీకే వచ్చాను. బండి చీకటితోనే వచ్చింది..."

ఏదో మాట్లాడుతున్నాడు. ఏం మాట్లాడితే నేం. అమ్మకళ్ళు దక్షిణేపు వాకిలి మీదే వున్నయి. ఎంతో ఆత్రంగా గుడిశెల మీద నుంచి చేలోకి చూస్తున్నది.

గోపాలం మాటలు వింటుందో...లేదో..

ఉన్నట్టుండి అమ్మ మొగం చింపిచేటం తయింది.

కళ్ళు మెరిసినయి.

ఆత్రంగా విసుగ్గా అంది.

"అబ్బా! యిప్పటికొస్తున్నారు. ఈ స్నానాలూ జపాలూను..."

గోపాలానికి కొఱ్ఱులు పాకినయి. రాజ్యం వేపు చూచాడు ప్రాణం పోతున్నట్లు.

'నే చెప్పలా' అన్నట్లు చూచింది.

అమ్మ ఎవర్నీ గమనించకుండా దక్షిణేపు వాకిట్లోకి పోతున్నది.

రాజ్యం వాకిలివేపు చూసింది. వాకిట్లోంచి గుడిశెల్లోకి, గుడిశెల మీదగా చేలల్లోకి చూసింది.

ఎదురూగ్గా కూచున్న గోపాలానికి రాజ్యం కళ్ళు పెద్దవై...మరింత పెద్దవై...మరింత పెద్దవై...

హడిలి పోయాడు.

గభుక్కున తను వెనక్కు చూశాడు.

దక్షిణేపు వాకిట్లోంచి గుడిశెల మీదగా చేలల్లోంచి చూశాడు.

దూరంగా యిద్దరొస్తున్నారు.

దగ్గర కొచ్చేస్తున్నారు...దగ్గరకొచ్చారు ...ఇంకా దగ్గరికి...

గుడిశెలుదాటి రోడ్డు ఎక్కారు.

గోపాలం నిలువునా నీరైపోయాడు. ఒళ్లు చెమటలు పట్టింది.

ఎదురూగ్గా గేటుదగ్గరలో కొచ్చారు.

విభూతిరేఖలు పెట్టుకుని, తడికొల్లాయి కొత్తినేసుకుని, చేతిలో ఖుడిచెంబుతో నలభైఏళ్ళ మనిషి...

ప్రొద్దున్నే చలిగాల్లోంచి చీల్చుకుంటూ వినపడుతూ "నన్నిడిచి పెట్టెళ్ళి నాడే నారాజు..." ఈలేస్తూ పాడుతూన్న పదేళ్ళ కుర్రకుంక...

సెమరేస్తూ వస్తున్న పాడిగేదె దూడ...

ఎట్లా దూకాడో ఎగిరి దూకేశాడు.

గుండ్రంగా ఇంకా గుండ్రంగా కుర్చీలో బిగబడ్డ లంబోదరం...

గాల్లో పల్టీవేశాడు.

తనెంబడే కుర్చీ గాల్లో మూడు పల్టీలేశి అర్ధచంద్రాకారంగా నాట్యంచేస్తూ దోవ కడ్డంగా నుంచున్న అమ్మ వీపుమీద గభేలుమని పడటం!

వాకిట్లోనుంచున్న అమ్మ అమాంతం

(25-వ పేజీ చూడండి)



"అమ్మతోరణి చూస్తాంటే ఎక్కడో ఓకో జనానా, తమ్ముడూ స్నానం చేసి తిరిగొస్తారని......"

# మూర్తిగారి మనస్తత్వం

శ్రీ కొండేపూడి
సూర్యకామరాజు

దేవుడు హఠాత్తుగా ప్రత్యక్షమై నిద్రపోతున్న మూర్తిని లేపి ఏమి వరం కావాలో కోరుకోమ్మని అడిగినట్టయితే ఏమి కోరతాడని మీ వుద్దేశం?-నిక్షేపమా? కాదు. అపురూప సౌందర్యవతియైన భార్యా? అసలేకాదు. పోనీ రాజాజీస్థానే ముఖ్యమంత్రిత్వమా? ఎంతమాట! అదీ కాకపోతే ఆంధ్రరాష్ట్ర రాజధాని అతడి వంటింట్లోనా?- అబ్బే, ఇవన్నీ అతడికి అనవసరం. ఒకవేళ దేవుడు పది పన్నెండు వరాలు కోరుకోమ్మంటే ఇవన్నీ కోరేవాడేమో కాని ఒక్క వరం కోరమంటే ఇంత బక్క వరాలు కోరతాడా?

"ప్రభూ, నా పరిసరాల్లో సంచరించే ప్రజలందరూ నా ఉద్దేశాలకు, అభిప్రాయాలకు, అభిరుచులకు అనుగుణంగా నడుచుకునేటట్టు వరం ప్రసాదించు"-ఇదే అతడు కోరే వరం!

తక్కినవాళ్ళందరూ తనలాటి మనుషులేననీ, వారికికూడా మెడలమీద తలకాయలున్నాయనీ, స్వతంత్రంగా వారికి కూడా కొన్ని అభిప్రాయాలూ, అభిరుచులూ వుంటవని అంటే మూర్తి ముమ్మాటికీ ఒప్పుకోడు.

"రాజుగారూ, ఇక్కడికి ముండకన్ని మొదలివీధి ఎంత దూరం ఉంటుందంటారూ?"

"అబ్బే ఎంతండీ, మూడుమైళ్లుంటుంది"

"పొరపడ్డారు. మూడుమైళ్ళ మూడు ఫర్లాంగు లుంటుంది."

"లేదంటే నాకు తెలుసు కచ్చితంగా మూడుమైళ్ళుంటుంది."

"మీకు తెలియదమేమిటండీ? - నే చెప్తున్నాగా మూడుమైళ్ళనీ."

—ఇది మూర్తితో పరిచయమేర్పడిన కొత్తరోజుల్లో జరిగిన సంభాషణ. చిన్నదైనా యీ సంభాషణవల్ల మూర్తి మనస్తత్వం మూడువంతులు అర్థమైపోయింది.

ఏవో కొన్ని సందర్భాలలో యాదాలాభంగా మూర్తితో అనేకమందికి పరిచయం ఏర్పడింది. కాని నిత్యజీవితంలోని ప్రతి చిన్న విషయంలోనూ వ్యక్తమయ్యే ఆంగ్లంలో "ఎగోటిజమ్" అనబడే మూర్తి స్వాతిశయానికి బెదరిపోవటంవల్ల వారి పరిచయం పరిచయంగానే వుండిపోయింది. త్రోవలో ఎదురుపడితే చిన్న చిరునవ్వు నవ్వేసి వారి దారిన వారు పోవటంతప్ప మూర్తితో మాట్లాడటానికి వారంతా ఇప్పుడు సాహసించరు.

అభిప్రాయాలూ, అభిరుచులూ ఏకమైతే ఆంతరంగిక స్నేహం ఏర్పడుతుందని చాల మంది అభిప్రాయం. ఈ అభిప్రాయంమీద నా కంతగా గౌరవంలేదు. భిన్నాభిప్రాయాలుగల ఇద్దరు మానవులు శత్రువులెందు కవ్వాలో నా కర్థంకాదు. స్నేహం, ప్రేమ అనేవి అభిప్రాయ భేదాలకు అతీతమైనవి. ఒక తరానికి చెందిన తండ్రికీ, మరొక తరానికి చెందిన కొడుక్కీ అభిప్రాయాల్లోనూ, అభిరుచుల్లోనూ సాధారణంగా భేదం వుంటుంది. అంతమాత్రాన వాళ్ళిద్దరూ మాట్లాడుకోటం మానెయ్యరు. శత్రువులయిపోయి కుస్తీ పట్టరు. ఆమాట కొస్తే కోటానుకోట్ల జనాభా గలిగిన విశాల ప్రపంచంలో ఏ ఒక్క రిద్దరి అభిప్రాయాలూ తూచినట్టు సరిగా వుండవే వుండవు. నా శరీరంలో ప్రవహించేటటువంటి రక్తమే ఎవరెవరి శరీరాల్లో ప్రవహిస్తూ వుంటుందో వారందరూ నాకు స్నేహితులే. సూది గ్రుచ్చితే తృళ్ళిపడే ప్రతివాడూ నా మిత్రుడే. అందువల్ల మూర్తితో నాకు గల పరిచయాన్ని అనేక అవమానాలకు, కష్టాలకు ఓర్చి మెల్లమెల్లగా స్నేహంగా మార్చుకున్నాను. ఎదుటివారిని ప్రతివిషయంలోనూ నిర్లక్ష్యం చెయ్యకూడదనీ, వారి అభిప్రాయాలుకూడా సక్రమమైనవి కావటానికి అవకాశం వుందనీ అతడికి తెలియచెయ్యటానికి విశ్వప్రయత్నం చేశాను, చేస్తున్నాను-చేస్తాను కూడా.

ఒకరోజు సాయంత్రం మూర్తీ, నేను పార్కులో కూర్చున్నాం. ప్రపంచంలోని వివిధ విషయాలమీద మూర్తికిగల అభిప్రాయ పరంపర అతని వదనగహ్వరంనుండి దుడుమా జలపాతంలాగ మీద పడుతుంటే ఉక్కిరిబిక్కిరై కిక్కురుమనకుండా కూర్చున్నాను. ఇంతలో మద్రాసులో విడేళ్ళపాటు ఆంధ్రరాజధాని వుండాలని వాంఛూ సూచించినట్టు రేడియో వెల్లడించిన వార్త వినపడింది.

"వాంఛూ కొంచెం భయస్తుడులా వున్నాడే. అరవలకు భయపడి విడేళ్ళనక పోతే ఆంధ్రుల పట్నంలో ఆంధ్రుల రాజధానిని శాశ్వతంగా ఎందు కుంచుకో కూడదూ?" కాల్తున్న సిగరెట్టును ఇంకో అరంగుళం కాలేటట్టు పీల్చి తృప్తికరంగా పొగ పైకి వదుల్తూ అన్నాడు మూర్తి.

"ఈ విషయంలో నన్నా నాతో ఏకీభవించినందుకు సంతోషం" అని అందామనుకుని కాస్త ఆలోచించి ఆఖరుకు అనకుండా వూరుకున్నాను. ఎంచేతంటే వాంఛూ సూచనమీద తను వెల్లడించిన అభిప్రాయాన్నే నేను వెల్లడించి వున్నట్టయితే నాకు వ్యతిరేకంగా వాదించి వుండేవాడు. ఎదుటివాడు అన్నదానికి వ్యతిరేకంగా వాదించటం అతనికి తమిళ సోదరులకు తంబాకులాగ అలవాటయిపోయింది. ఇంతవాడిని నేనుండగా ఎదుటివాడి మాట ఎందుకు రైటవ్వాలీ అన్న మనస్తత్వం అతనిలో గడ్డురోగం జీర్ణించినట్టు జీర్ణించిపోయింది. ఈ మనస్తత్వంయొక్క ప్రభావాన్ని అనేక సందర్భాలలో అనేకసార్లు రుచిచూశాను. ప్రస్తుతం అతడు ఆంధ్రరాష్ట్రం విషయంలో సరైన అభిప్రాయాన్ని ప్రకటించాడు కాబట్టి నా అభిప్రాయంకూడా అదేనని తెలుస్తే తన అభిప్రాయానికి కొంచెం పురెక్కించి ఇంకో విధంగా మారుస్తాడేమోనని నా భయం.

సరిగ్గా ఇది జరిగిన ఇరవైరోజులకి నేనూ, మూర్తీ బజారువెంటనడిచి వెడుతున్నాం. చాలాదూరం నడిచామేమో మాంబళంలో తిన్న కుశంబూ అన్నం కాస్తా అరిగిపోయింది. ఇంతలో ఒక ఫలానా ఫలానా విలాస్ సమీపించాం.

"మూర్తిగారూ, కొంచెం కాఫీ తాగుదాం రండి" అతని భుజంమీద చెయ్యివేసి అన్నాను.

"ఈహోటళ్ళోనా! ఇక్కడ కాఫీ చాలా ఛండాలంగా వుంటుంది" అన్నాడు.

నిజానికి మద్రాసులో వున్న మంచి

హోటళ్ళలో అదొకటి. అయినా అతని మాటకు నేను ఆశ్చర్యపడలేదు. ఎదుటివారు అన్నది కాదనటం అతనికి పరిపాటేగా.

"పొరపడ్డారు. ఈ హోటలు మీరన్నంత చెడ్డది కాదు. చూడండి లోపల ఎంతమంది జనం వున్నారో."

"వాళ్ళంతా ఉత్త మేకలమంద. బాగుందని ఎవరో వెంకయ్య అనేసరికి అదే దూరటం దూర్తారు—బుర్రల్లో కాస్త గుజ్జుండేడిస్తేగా"

"నిండు ప్రాణాలతో వున్న అంతమందిని నిర్లక్ష్యంగా విరిచి పారెయ్యటం తగదు. రండి నా మాట విని" అంటూ అతని అంగీకారానికి ఎదురుచూడకుండానే బలవంతాన లోపలికి లాక్కెళ్ళాను. అతడిని ఒక కుర్చీలో కూలేసి నేనో కుర్చీలో కూర్చున్నాను.

సర్వరువచ్చి మూర్తివైపుచూసి ఏం కావాలన్నట్టు గుడ్లు పెద్దవిచేశాడు.

"నాకేమీ వద్దు" అంటూ మూర్తిమూతి మూరెడు చేసుకున్నాడు.

"మీరట్లా అనటం న్యాయం కాదు. మీరేమీ తినకుండా ఎదురుగా కూర్చుంటే నాకేం సయిస్తుంది చెప్పండి. కంపెనీకోసమన్నా ఏదన్నా తీసుకోండి" అని ప్రాధేయపడ్డాను.

"కంపెనీలేదు, గింపెనీలేదు. మీకేదో త్వరగా కానియ్యండి తర్వాత స్నేహా హోటల్లో తీసుకుంటాను."

అతని మొరటుతనానికి నొచ్చుకొని చేసేదేమీ లేక స్పెషల్ మసాలాదోసె బాగా కాల్చి తీసుకురమ్మని సర్వరుతో చెప్పాను.

బాగా కాల్చిన మసాలాదోసె మూర్తికి తగని యిష్టం. నేను తలవంచుకొని తింటూ మూర్తికి తెలీకుండా అతని దృష్టి ఎటువైపు వున్నదీ ఓరకంట కనిపెడుతూ నేవున్నాను. నేను తింటున్న ప్రతిముక్కనీ అతడి కనుచూపు అనుసరిస్తోంది.

"కొంచెం తినిచూడండి" హఠాత్తుగా తల పైకెత్తి ఒక చిన్నముక్క అతడికి అందివ్వబోయాను.

ఒక్కసారి తెల్లబోయి తర్వాత కాస్త తమాయించుకుని—

"నాకొద్దు, మీరు తినండి" అనేసి ముఖం ఇంకోవైపు తిప్పుకున్నాడు.

మూర్తి దురదృష్టవశాత్తు ఆవైపుకూడా ఒక పెద్దమనిషి ఎర్రగా కాల్చిన మసాలా దోసె తింటున్నాడు. ఆ సమయంలో మసాలాదోసె తినాలని మూర్తికి బాగా వున్నట్టు అతని ముఖంలో ముద్రగుద్దినట్టు కనబడుతోంది. క్షుద్రమైన కనుచూపు కలిగి ఆకలితో అటమటించిపోతున్న ఆసామిని తీసుకువచ్చి చేతులు వెనక్కు విరిచికట్టి, నోటినిండా గుడ్డలుకుక్కి అతనిముందు అరమూరు దూరంలో పంచభక్ష్య పరమాన్నాలతో కూడిన వెండికంచం ఉంచామనుకోండి. అప్పుడా ఆసామీ మనస్సులో ఎట్లా వుంటుందో మీరు వూహించినట్టయితే ఫలహారం సేవిస్తున్న పదిమందిమధ్య జిహ్వా చాపల్యాన్ని మాట పట్టింపుకోసం బలవంతాన్న అణచిపెట్టుకుని కూర్చున్న మూర్తి మనస్సు ఊహించినట్టే.

ఆ సమయంలో మూర్తిని చూసి నిజంగా జాలేసింది.

"మూర్తిగారూ, మీకిప్పుడు దోసె తినాలని వుంది. నామాట విని దోసె తెప్పిస్తా తినండి" అన్నాను.

"తినాలనుందో లేదో నా సంగతి నాకు తెలీదా యేం" కంఠస్వరంలో కోపం లేకపోలేదు.

"తెలుసు. కాని మనస్సులో సంగతి బయటపెట్టటానికి మీకు ధైర్యం చాలటం లేదు. నిజానికి పొరపాటు ఒప్పుకోటంలోనే మనిషియొక్క ధైర్యం వ్యక్తమాతుంది. తన తప్పు మనస్సులో గ్రహించినప్పటికీ బహిరంగంగా అంగీకరించలేని వాళ్ళు ఉత్త పిరికివాళ్లు" అంటూ కాఫీ ఆఖరుగుక్క మింగాను. మూర్తి ఇంకేమీ మాట్లాడకుండా లేచి నిలబడ్డాడు. ముఖం మాత్రం బాగా ఎర్రగావుంది.

స్నేహా హోటల్లోంచి బయటకు రాగానే నా స్నేహితుడు పిచ్చయ్య కనపడ్డాడు. అతడిని మూర్తికి పరిచయం చేశాను. ముగ్గురం నడుస్తున్నాం.

"అయితే మూర్తిగారూ, మన మద్రాసు సంగతి ఏమవుతుందంటారూ?" పిచ్చయ్య అడిగాడు.

"మద్రాసు మనదని మీ కెవరు చెప్పారూ?"

సూటిగా వేసిన యీ ప్రశ్నకు పిచ్చయ్య ముందు కొంచెం గాభరాపడి తర్వాత తేరుకుని అన్నాడు—

"చరిత్ర చెప్తోంది; ప్రస్తుత పరిస్థితులు చెప్తున్నాయి."

"మీరు చదివినచరిత్ర, అవగాహనచేసుకున్న పరిస్థితులు యధార్థానికి దూరంగా వున్నాయని చెప్పటానికి విచారిస్తున్నాను పిచ్చయ్యగారూ"

"ఇంతకీ మద్రాసు మనదికాదనా మీ ఉద్దేశం?"

"తప్పకుండాను"

"అయితే మద్రాసులో మన రాజధాని ఉండటానికి వీల్లేదంటారా?"

"ముమ్మాటికీ వీల్లేదు."

పిచ్చయ్యకి కోపం వచ్చిందా లేదా అన్న సంగతి అటుంచి నామటుకు నాకు మూర్తి వరసచూసి వళ్ళు భగ్గుమండింది. ఇరవైరోజులక్రితం యీ పెద్దమనిషి పార్కులో అన్నదేమిటి, ఇప్పుడు అంటున్నదేమిటి! మండిందంటే మండదూ?

"క్షమించాలి మూర్తిగారూ. ఇప్పుడు మీరు వెల్లడించిన అభిప్రాయానికి పూర్తిగా వ్యతిరేకమైన అభిప్రాయాన్ని ఇరవైరోజులక్రితం పార్కులో వెల్లడించారు. ఈవిధంగా కుప్పిగంతులు వెయ్యటం చాలా అన్యాయం" అన్నాను ఉండబట్టలేక. మూర్తి నామాటని పూర్తిగా నిర్లక్ష్యం చేసి పిచ్చయ్యవైపు తిరిగి అన్నాడు.

"పిచ్చయ్యగారూ, నే చెప్తున్నా నమ్మండంతే. మద్రాసు మనదికాదు."

"మీరు కాదంటే సరా. ఇక్కడ మనవా—"పిచ్చయ్యమాట పూర్తికాకుం

డానే మూర్తి అందుకొని "అబ్బ, నే చెప్పాకదండీ మనది కాదనీ" అన్నాడు.



## మూర్తిగారి మనస్తత్వం



యథార్థాన్ని బయటకు లాగటమే వాదన యొక్క ముఖ్యోద్దేశం. వాదనలో పాల్గొనే వారిలో ప్రతివాడూ తను చెప్పేనదంతా ఎదుటివారికి వినిపించటమే కాకుండా ఎదుటివారు చెప్పేనదికూడా మనస్ఫూర్తిగా విని వారు చెప్పేందాంట్లో నిజం వుంటే గ్రహించటానికి సిద్ధపడాలి. అటువంటి వాదన జరిగినప్పుడు యథార్థం బయటపడ

టానికి అవకాశం వుంది. కాని మూర్తివంటి కేవలం వాదనకోసమే వాదించేవారి వాదన వల్ల యథార్థం మరింత అడుగునపడిపోయి అసలు వాదనయొక్క లక్ష్యమే దెబ్బతింటుంది. అటువంటివారితో వాదించేకన్న మౌనము ప్రవహిస్తేనే మేలు. అందువల్ల ఇంకేమీ మాట్లాడవద్దని పిచ్చయ్యకు సంజ్ఞ చేశాను.

ఇంతలో నేనూ, మూర్తీ విడిపోయే రోడ్డుకూడలి సమీపించాం. ఒక్క పాతిక రూపాయిలు అర్జంటుగా కావాలని పిచ్చయ్య రహస్యంగా నన్నడిగాడు. ఆ సమయంలో నా జేబులో సరిగ్గా శేడా అర్థణావుంది. లాడ్జికి పోయినా ఇంకో రెండుమూడు రూపాయిలకంటే దొరకవు. కరువు సమయాల్లో మూర్తిదగ్గర చేబదులు తీసుకోవటం నాకు అలవాటే. కాని అతడు అవునన్నది నేను కాదన్నరోజున మాత్రం దమ్మిడీకూడా ఇవ్వడు. అది నాకు బాగా అనుభవమే. అయినా వేళావిశేషం మంచిదయితే ఒకవేళ ఇస్తాడేమోనని అడిగేశాను.

"పాతిక రూపాయిలా! పాతిక కాన్లు కూడా లేవు" అనేసి మూర్తి కుడివైపు సందులోకి మళ్ళాడు.

ఇవ్వనని నిర్మొగమాటంగా చెప్పేస్తే నాకంత కోపం వచ్చేదికాదు. మూర్తి నెప్రహూ హోటల్లో నూరురూపాయిలనోటు మారుస్తూంటే కళ్ళారా చూశాను. ఒకటి రెండు తక్కువగా వందరూపాయలు జేబులో వుంచుకుని పాతిక రూపాయలు లేవని చెప్పిన పెద్దమనిషిని ఏమనాలి.





"ఇప్పుడు నువ్వు బటానీలు పెట్టకపోతే రేపు నేను శనగపప్పు కొనుక్కున్నప్పుడు నీకు పెట్టను" అన్న చిన్నపిల్లలమాట జ్ఞాపకాని కొచ్చింది.

"రాజూ, రేపు మధ్యాన్నం వొస్తాను. ఎట్లాగన్నా సరే నువ్వప్పటికి డబ్బు సిద్ధం చెయ్యాలి" అని ఆజ్ఞాపించి పిచ్చయ్య బస్సెక్కి వెళ్ళిపోయాడు.

పాతిక రూపాయలు సంపాదించే దారి ఏదన్నా ఉందా అని రాత్రి చాలసేపటివరకూ ఆలోచించాను. ఏదారీ కనపడలేదు. తిరిగి మూర్తినే ఆశ్రయించాలి. వెళ్ళి వెళ్ళడంతోటే మద్రాసు మనది కాదని ఒప్పుకుని తర్వాత డబ్బడుగుతే పని జరగొచ్చు.

మర్నాడు పెందలాడే లేచి కాఫీతాగి తిన్నగా మూర్తిదగ్గర కెళ్ళాను నేను వెళ్ళేసరికి మూర్తి పడక్కుర్చీలో కూర్చుని పేపరు చదువుతున్నాడు. పేపరు అతని ముఖానికి అడ్డంగా వుండటంవల్ల నారాకనతడు గమనించలేదు.

"మూర్తిగారూ, రాత్రి బాగా ఆలోచించాను. మద్రాసు మంది కాదు" అన్నాను.

మూర్తి తొణకలేదు. బెణకలేదు. నేనక్కడ వున్నట్టు తన కదివరకే తెలిసినట్టుగా పేపరుకూడా ముఖానికి అడ్డు తియ్యకుండా అన్నాడు—

"అయితే పొరపడ్డారు. ముమ్మాటికీ మద్రాసు మందే!" ★

## ★ నైర్యం....! ★

(21-వ పేజీ తరువాయి)

పక్కనేవున్న పాతరమీద పడటం! తుపాకిగుండు పోయినట్లు గోపాలం గాల్లో 'జుంయి' మని పోటం!

అన్నీ ఒక్కసారి జరిగినయి...

అమ్మ ఒళ్ళు దులుపుకుని లేచి చూచేసరికి దక్షిణేపు వాకిట్లోంచి దూకిన గోపాలం 50 అడుగుల దూరంలోవున్న దక్షిణేపు గేటుమీద పడటం!

ఆ ఊపుకు స్ప్రింగుకూ ఎప్పుడూ రోడ్డువేపుకు పోని తలుపులు రెండుగోడలను పెటపెటమనిపిస్తూ రోడ్డువేపుకు నెట్టుకుపోటం!

రోడ్డుమీద పోతున్న సైకిలు మనిషి అమాంతం గుడిశల్లోకి దూసుకుని గోపాలంతో టాకీ యివ్వకుండా తప్పించుకోవటం!

"అంత హడావుడి చేశావేం, నిముషంలో వచ్చేశాం చూశావా, గేదెకు పాలు తీసి కాఫీ చెయ్యి. గోపాలం వచ్చేవేళ..." అంటూ గేటు లోపలికి రాబోతూ నిలువునా నాన్న నిర్ఘాంతపోటం!"

పాకలోనికి గేదెను దూడను తోలుకుపోతున్న తమ్ముడు వెర్రిగా వెకిలిగా నవ్వటం!

ఇవన్నీ గూడా ఒక్కసారే జరిగినయి. పాత దుమ్ము దులుపుకుంటూ లే చొచ్చిన అమ్మతో—

"ఎవడా పిచ్చాడు. ఎందుకలా దౌడు తీస్తున్నాడు. దయ్యమేమన్నా పట్టిందాయేం. లేక దయ్యాలేమన్నా కనపడుతున్నయ్యా కళ్ళకి..."

నాన్న మండిపడ్డాడు.

అమ్మనోట్లోంచి మాటలు రాలేదు. తెరిచిన నోరలా తెరిచే ఉంది.

"ఆయన నాన్నా. సీతప్పకొడుకు గోపాలంట...పాడి గేదెలంటె మహాభయం అతనకి. అదేమిచిత్రమో పాడిగేదెప్పుడో పొడిచిందిట తన్ని పాలుదియ్యబోతే. అప్పటినుంచీ మహాభయం టతనికి. అమ్మతలంటి పోసుకున్నంతసేపూ అదే మయిన ఆ పాడిగేదే పొడవటం విషయం చెబుతున్నాడు. ఇంతలో నువ్వు తమ్ముడూ పాడి గేదెతో సహా ప్రత్యక్షమయ్యే సరికి మనిషికిహై ప్రాణాలు పయినబోయినయి..."

రాజ్యం వెనకనుంచి దీర్ఘాలు తీసింది.

"ఓరిచవటా!"

విరగడి నవ్వారు అమ్మానాన్న.

"వీడికా రాజ్యాన్నియివ్వాలనుకుంది."

ఖడవిరగడయిందన్నట్లు నిట్టూర్పు వెలిబుచ్చారు.

కాంతెతనమన్నా, హాస్యమన్నా హాబీలు రాజ్యానికి !!! ★



# విజ్ఞాన వీధులు

"డాక్టర్"




## 109. తేజోవక్రీభవనం అంటే ఏమిటి?

బండియెక్కి రోడ్డుమీద మనందరం ఎప్పుడో ఒకప్పుడు ప్రయాణం చేసే యుంటాం. రోడ్డు అంతటా సామానంగా సాఫీగా ఉంటే బండి సమంగా నడుస్తుంది. అట్లు బండి సమంగా నడుస్తున్న సమయంలో దాని చక్రాలలో ఒకటి గాడిలో పోసిన అణగని కంకరపైనా రెండవది సాఫీగానున్న రోడ్డుమీదా దొర్లడం సంభవించిందనుకొందాం. అట్టి సన్నివేశం మన రోడ్లపై అసాధారణం కాదు. అందుచేత ఆ సమయంలో బండి ఎట్లు నడుస్తుందో అనుభవపూర్వకంగా మనం చెప్పగలం. సాఫీరోడ్డుపై నడుస్తున్న చక్రం ఎక్కువ వేగంతో ముందుకు సాగగా, అణగని కంకరపై నడుస్తున్న చక్రంయొక్క వేగం సాపేక్షంగా మందగించి, బండి అణగని కంకరపై నడుస్తున్న చక్రంవైపుకు కొంచెం వంకర తిరుగుతుంది. ఈసంఘటనను సాదృశ్యంగా తీసికొంటే తేజోవక్రీభవనమంటే యేమిటో సులువుగా గ్రహించవచ్చును.

కాంతికిరణాలు దేనిగుండా ప్రవహిస్తాయో దానికి యానకము (*Medium*) అని పేరు. సమాన సాంద్రతగల ఒక యానకంగుండా ప్రయాణంచేస్తున్న కాంతికిరణాలు అందుకు భిన్నమైన సాంద్రతగల మరియొక యానకంగుండా ప్రవహించవలసి వచ్చినప్పుడు, మొదటి యానకంలోని దాని వేగ పరిమాణానికీ రెండవ యానకంలోని దాని వేగ పరిమాణానికీ కొంత వ్యత్యాసముంటుంది. కాబట్టి రెండవ యానకంలో ఆ కాంతికిరణదిశ మొదటి యానకంలోని దాని దిశతో కొంతవంగియుంటుంది. ఇట్లు కాంతి కిరణ దిశలో వచ్చే మార్పు రెండవ యానక తలంపై కాంతి కిరణం పతనమైనపుడే వస్తుంది. ఈసంఘటననేవక్రీభవనము (*Refraction*) అని అంటారు.

తేజోవక్రీభవనంవలన నిత్య జీవితంలో అనేక విచిత్రమైన సన్నివేశాలు తారసిల్లుతుంటాయి. నుయ్యి వాస్తవంగా ఉన్న లోతుకంటె తక్కువ లోతుగా అనడం, నక్షత్రాలు మినుకు మినుకు మనడం, ఎండమావులు ఏర్పడడం, నీటిలో గ్రుచ్చిన నిడుపాటి కర్ర నీటి తలంవద్ద విరిగినట్లు ద్యోతకంకావడం, బల్లమీద పెన్ను పెట్టి, పెన్నుపైని గాజు దిమ్మను పెట్టి, దిమ్మగుండా చూస్తే, పెన్ను గాజు దిమ్మలోనికి పైకివచ్చినట్లు కనపడడం - ఇట్టి వన్నీ వక్రీభవనం వలన తేజస్సు చేసే గారడీయే.

—అనంత్.

## 110. తేదీ రేఖ

"మనముకూడా భూమి తిరిగే వేగముతో తూర్పునుంచి పడమరకు ప్రయాణము చేసినచో, చీకటి తగలకుండా వుంటుందా?" అని గుమ్మళ్ళదొడ్డినుంచి నాగులపాటి రాజబాబుగారు అడుగుతున్నారు.

భూగోళముయొక్క వ్యాసార్ధము 4000 మైళ్ళు. చుట్టుకొలత 24000 మైళ్ళు. ఈ దూరము 24 గంటలలో జరిగిపోతోంది కనక భూమిమీద మనమూ, మన యిళ్ళూ, వాకిళ్ళూ, చెట్లూ, చేమలూ, గంటకి వేయి మైళ్ళ వేగంతో పడమరనుంచి తూర్పుకి సాగిపోతున్నాయి. అందువల్లనే సూర్యుడు తూర్పునించి పడమరకి సాగిపోతున్నాడు. అయితే ఏ రాకెట్టు కారులోనో మనము తూర్పునుంచి పడమరకి గంటకి 1000 మైళ్ళ వేగంతో సాగిపోతాము అనుకోండి. 'అప్పుడు సూర్యుడు నెత్తిమీదికి ఎక్కకుండా ఉదయించినవాడు ఉదయించినట్టే వుంటాడా?' అని రాజబాబుగారి ప్రశ్న. 'అవును. సందేహ మేమిటి?' అని జవాబు.

గంటకు వెయ్యి మైళ్ళ వేగము వదిలిపెట్టేయండి. ఒక ఓడలో బొంబాయిదగ్గర బయల్దేరి పడమటికి వెళ్ళుతున్నా మనుకొండి. నాలుగు రోజులలో 1000 మైళ్ళు వెళ్ళినామనుకొండి. అంటే భూమి ఒక గంటలో తిరిగేటంత దూరము మనము ప్రయాణించాము. ఇంత దూరము తిరగాలంటే భూమికి ఒక గంట పడుతుంది. అంటే బొంబాయిలో ఉదయించే సూర్యుడు మనమున్నచోట ఉదయించాలంటే ఒక గంట ఆలస్యమాతుందన్నమాట. అంటే బొంబాయిలో ఉదయం ఆరు గంటలైనదంటే మనమున్నచోట ఐదు గంటలే అవాలి. అవునా? సరిగ్గా అంతే అవుతుంది. మనదేశంనుంచి ఇంగ్లండు వెళ్లుతూంటే వెయ్యిమైళ్ళకి ఒక గంట చొప్పున వాచీలు వెనక్కి తిప్పుకుంటూ వుండాలి. ఇంగ్లండునుంచి మనదేశం వస్తే వెయ్యి మైళ్ళకి ఒక గంట చొప్పున ముందుకు తిప్పాలి. దీని సొగసు ఇంతమాత్రమే కాదు. జపానులో జనవరి ఒకటవ తేదీని సూర్యోదయమవుతూన్న కాల మనుకొండి. అప్పుడే ఇండియాలో డిసెంబరు 31 తేదీ రాత్రి 2 గంటలవుతుంది. ఏడెనుదగ్గర డిసెంబరు 31 తేదీ రాత్రి 12 గంటలు. జిబ్రాల్టరు సమీపాన్ని రాత్రి 8 గంటలు. న్యూయార్కులో 31 వ తేదీ సాయంత్రము నాలుగు గంటలు. క్యాలిఫోర్నియాలో 31 వ తేదీ పగలు ఒంటిగంట! పడమటికే కాదూ సాగిపోతున్నాము? అలాగే పసిఫిక్కు మహాసముద్రము దాటుతూ డిసెంబరు 31 తేదీ ఉదయాన్ని జపానులో అందుకుంటాము. అయితే ఆ ఉదయము జనవరి 1 వ తేదీ ఉదయము అనికాదూ అనుకున్నాము? ఇదేమిటిది? భూప్రదక్షిణముచేస్తూ పడమరవైపే పోతే జపానుదగ్గర ఒక రోజు కేలెండరు వెనక్కి తిప్పవలసివస్తోంది. భూమిమీద అంతటా తేదీలెక్క ఒక్కటే కావాలి గనక, జపానుకి తూర్పున 'తేదీ రేఖ' అని ఒక రేఖ మ్యాపులో గీశారు. ఇది ఏ దేశాన్నీ తగలక సముద్రముమీదే వుంది. ఈ రేఖని తూర్పునించి పడమరకి పైన మనం చేసినట్టు ప్రయాణం చేస్తూన్నవారు ఆ రేఖ దాటేటప్పుడు ఒక రోజు ముందుకి కేలెండరు జరపాలన్నారు. ఇలాగ జరిపితే

జపానులో జనవరి 1 వ తేదీ సూర్యోదయమే అవుతుంది. పడమరనుంచి తూర్పుకి వెళ్ళేవారు ఈ రేఖ దాటేటప్పుడు కేలెండరులో ఒక రోజు వెనక్కి పెట్టాలి.

మీరు అమెరికాకి ప్రయాణిస్తూ జపాను దాటి జనవరి ఒకటో తేదీకి వచ్చారనుకోండి. ఆ "తేదీరేఖ"ని మీ ఓడ దాటేటప్పుడు, గభీమని ఆరోజే, ఆ క్షణమే డిసెంబరు 31 వ తేదీ అయి వూరుకుంటుంది! ముందుకి వెళ్ళడము ఇష్టము లేకపోతే వెనక్కి వచ్చేయండి. మళ్ళీ జనవరి ఒకటవ తేదీ అయిపోతుంది! రక్షించి తేదీరేఖ ఏ దేశముమీదనుంచీ పోకుండా సముద్రములోనే సాగిపోయేటట్టు చూశారు. సముద్రాలమీద దావాలూ, పరీక్షలూ ఉండవుగా!

## చిట్టిప్రశ్నలు - జవాబులు

—'గ్రహాలన్నీ తమచుట్టూ తాము తిరుగుతూన్నా'యన్న 'రావు'గారి రాతలకీ, మీరు 'బుధగ్రహము ఎప్పుడూ ఒకే ముఖాన్ని సూర్యుడివైపు చూపిస్తుంద'ని చదివిన దానికీ విరోధములేదు. "సూర్యుడి చుట్టూ ఒక మారు తిరగడానికి పట్టేకాలములో బుధగ్రహము తనచుట్టూ తాను ఒక మారు తిరుగుతోంది" అన్నమాట నిజము. కనకనే బుధగ్రహము ఒకే పార్శ్వాన్ని చూపిస్తుంది సూర్యుడికి. ఒక స్తంభము వేపే ముఖముపెట్టి ఒక కుర్రాణ్ణి తిరగమని, కుర్రాడు తనచుట్టూ తాను తిరుగుతున్నాడో లేదో గుర్తించి రాయండీ చూదాము.




—పటములో చూపినట్టుగా ఒక దీర్ఘవృత్తాకార దర్పణము వక్రరేఖ వెంబడి ఒకే బీటవేసి, పగిలిందనుకోండి. అప్పుడు, 1,2 అనేముక్కల ముఖాలు ఒకేతలములో ఉన్నట్టైతే ఒక బింబమే కనబడుతుంది. ఈ 1, 2 ల ఉపరితలాలు ఒకే తలములో ఉండక ఒకదానికొకటి చిన్నకోణములో ఆ సమ్మేళనము ఒక బింబాన్ని చూపదు. రెంటినీ చూపిస్తుంది. చిత్రములో చక్కగా బిగించిన అద్దము నడిమిని ఒక ముక్క పోయినా, ఒకే బింబాన్ని చూపడము మీరు గమనించలేదా?

—మనకిలాగే ఈగలకి చీకటిలో కళ్ళు కనబడవు. కనకనే చీకటిపడడముతో ఈగలు ఏ గోడమూలకో చేరుకుని రాత్రి అంతా గడుపుతాయి. పగటిపూట కూడా భోజనాల గదిలో ఎక్కువగా ఈగలు ముసురుతూంటే తలుపులన్నీ మూసి ఒక్కటి కొంచెము ఓరవాకిలిగా తెరుస్తే, లోపలి ఈగలన్నీ ఆ సందుద్వారా బయటికి వచ్చేస్తాయి. అప్పుడు దీపము వేసుకుని భోజనము చేస్తే ఈగలబాధ వుండదు. ఈగలకి చీకటిలాగే మలేరియా తెచ్చే దోమలకి కాంతి సరిపడదు.

 **నాగపూజ** 

చిత్రకారుడు : శ్రీ సూర్యప్రకాశ నామదేవ్ (మద్రాసు.)

(హైదరాబాదు ప్రభుత్వ చిత్రకళా మందిరంలోని చిత్రం)



## వ్యోమకేశుడు

చిత్రకారుడు : శ్రీ ఆర్. వి. చిన్నారావు, (దుగ్గుదుర్రు.)

# బొమ్మరిల్లు

# ఉపాయం



రచన: శ్రీ ద్రోణాదుల శ్రీహరిరావు

అత్తగారింటికి
అల్లుడెళ్లాడు
తోడుగా మిత్రుణ్ణి
తీసుకెళ్లాడు
కొత్తల్లుడని అత్త
కోరివండింది
గారెలూ బూరెలూ
అరిశెలూ పాయసం
వెంటవచ్చిన వాడి
పంట పండింది
వద్దు వద్దంటూనె
తెగబొక్కు తున్నాడు
ఎందు కెందుకు యంటు
తెగ మెక్కుతున్నాడు
జరిగింది కొన్నాళ్లు
ఓపికెన్నాళ్లు?
అత్తమామలు యింక
కలతపడి పోయారు
కడసారి వారేమొ
యోచించ సాగారు
అల్లుడేవారి కొక
బంగారు పంట
ఈ మిత్రుడంటే వాళ్ల
కరికాలిమంట
"ఏమండీ! వీడెవడండీ!
విఘ్నేశ్వరుడా! శనేశ్వరుడా
వీడెందుకు పోక
పనికెడితే తోక

చుట్టమై చూడొచ్చి
దయ్యమై పట్టాడు
మిత్రుడై వచ్చాడు
మిత్తియై చేరాడు
అయ్యో! నాఖర్మంగాల
అయ్యో! వీడాకలిగాల
మనిషేమొ జానెడు లేదు
పొట్టేమో పిడికెడు లేదు
వీడెందుకు పుట్టాడంటే
తినటానికి పుట్టాడు
అయ్యో! నా గ్రహచారం
లేకుంటే వీడి ప్రతాపం!
మన బూరెల బుట్టలమీద
కుస్తీ పరవాన్నంమీదా!
పట్టంతా పొంగలిమీదా!
సిగ్గు యెగ్గూ లేక
మేకలామేస్తుంటె
గాడిదల్లేవీడు
గుట్టుగా తింటుంటె
చేసి పెట్టా లేక
ముందునే చస్తుంటి
రోమ ముందనుకొంటె
మీసమే లేదయ్యొ
నిజం చెబుతున్నాను
నిక్కచ్చిగాను
పూరుకున్నామంటె
వీడు కొన్నాళ్లుంటె

మన యిద్దరిని కూడ
నంజేసిపోతాడు
ఎట్లనైనా వీణ్ణి
వెళ్లగొట్టాలి
"మెల్లగా వీడికొక
వాతపెట్టాలి"
అని అత్త ఆరాత్రి
నూరిపోసింది
అక్కసంతా భర్త
యెదుట కక్కింది
తెల్లవార్లూ మామ
యోచించినాడు
ఎందుకో తృప్తిగా
నవ్వుకున్నాడు
మరునాడు పొరిగూరి
పుల్లయ్య వచ్చాడు
"ఎవ్వరయ్యా వారు"
అని ప్రశ్న విసిరాడు
"బుష్‌కోటు పిల్లాడు
నాబిడ్డ మొగుడు
ఆపక్కనే వున్నట్టి
వాడు నామొగుడు"
అని మామగారపుడు
గట్టిగా అన్నాడు
ఆదెబ్బతో వాడు
అయిపుగియిపూ లేదు
ఈనాటివరకు వా
డంతుపంతూ లేదు!






(గతసంచిక తరువాయి)

చీమలంటే నేలమీద పాకుతూ పోతాయి కాబట్టి, వాటివొంట్లో నుంచీ వచ్చే ఆ పదార్థమేదో నేల మీద చాలుగట్టి, మిగిలిన చీమలకి ఆహారం ఎక్కడవుందో అక్కడికి పోవటానికి దారి తెలుస్తుంది. తేనే టీగల విషయం అల్లాకాదుగా! అవి గాలిలో ఎగురుతాయి. పైగా అవి మధువుకోసం తుట్టె వదిలి పెట్టి దాదాపు రెండుమైళ్లవరకు కూడా పోయివస్తుంటాయి. ముందుగా పోయిన తేనెటీగ తను ఏ పూవులో మధువు కనుక్కొన్నదీ తుట్టెకి తిరిగి వచ్చాక మిగిలిన తేనె టీగలకి ఎల్లా చెప్పకలుగుతున్నదీ మనకి ఒకపట్టాన అర్థమయ్యే విషయం కాదు.

ఈ విషయమై కార్ల్ వాన్ ఫ్రిస్చ్ అనే జర్మన్ శాస్త్రవేత్త విపరీతమైన కృషి చేశాడు. గాజుతో పెట్టెలు చేయించి ఆ పెట్టెలో తేనె తుట్టెలను పెంచాడు. చుట్టూ పెద్ద పూలతోట పెంచి ప్రతి నిత్యమూ యీ తేనెటీగల వృత్తి వ్యాపారాలను పరీక్షిస్తూ కూర్చునేవాడు. ఏదైనా పూవులో మకరందం వున్నట్లు పసిగట్టిన తేనెటీగ, వెంటనే తుట్టెవద్దకు వచ్చి, గాలిలో ఎగురుతూ నృత్యం చేస్తూవుండటం యీయన గమనించాడు. ఆనృత్యంలో కూడా, గుండ్రంగా చుట్టు తిరిగే రకం ఒకటి, కొంత దూరం సూటిగా ఎగురుతూ పోయి అక్కడ క్షణకాలం నిలిచి పొట్ట భాగాన్ని అతివేగంగా అటూ యిటూ ఆడించేసి వెనక్కి తిరిగి వచ్చేరకం ఒకటి, మొత్తం రెండు రకాల నృత్యాలు అమలులో వున్నట్లు కూడా యీయన కని పెట్టాడు.

ఎప్పుడైతే ఒక తేనెటీగ తుట్టెను వదిలిపెట్టి వెళ్లి మళ్లీ తిరిగొచ్చి, యీ రెండు రకాల నృత్యాలలో ఏదో ఒకటి చేయటం మొదలుపెట్టుతుందో అప్పుడే తుట్టెలోని మిగిలిన తేనెటీగలకన్నిటికీ ఆనందోద్రేకం కలుగుతుంది. ఇవికూడా ఆ తేనెటీగనే అనుకరిస్తూ కాసేపు నాట్యంచేసి, ఆమీదట బారులు బారులుగా ఎగురుకొంటూ పోయి, సరిగ్గా ఆపూవుమీదనే వాలి, మకరందాస్వాదనం చేస్తాయి.

కానీ యీ నాట్యాలకు గల వ్యాఖ్యానం ఏమిటో ఆయనకు ఎంతకీ బోధపడలేదు. కొన్ని తేనె టీగలను పట్టి, వాటి రెక్కలమీద నీలపురంగు గుర్తుగా పెట్టాడు. మరికొన్నిటి రెక్కల మీద ఎరుపు రంగు గుర్తుగా పెట్టాడు. నీలిరంగు గుర్తుగల తేనెటీగలు తుట్టె దగ్గరగా [కొన్ని గజాల దూరంలోనే] వుండే పూలలోనే ఆహారం వెదుక్కొనే టట్లు వాటికి అలవాటు చేశాడు. ఎరుపురంగు గుర్తుగల తేనెటీగల తుట్టెకు రెండు ఫర్లాంగుల దూరంలో వుండే పూలల్లోనే మకరందంకోసం వెదుక్కొనే అలవాటు చేశాడు. ఆ తేనెటీగలన్నీ తుట్టెదగ్గరకు వచ్చి నాట్యంచేస్తూ వుంటే ప్రొఫెసర్ వాన్ ఫ్రిస్చ్ తానూ నాట్యం చూడలేకుండా వుండలేకపోయాడు.

అంతగా ఆపలేని ఆనందం ఆయనకు ఎందుకు వచ్చిందంటే-తుట్టెకు దగ్గర్లోనే తిండిదొరికిందని సూచించటానికి నీలపురంగు గుర్తుగల తేనె

ముగ్గురు పిల్లలు ఆపెద్ద కొట్లోకి పరిగెత్తుకొంటూ వచ్చారు. అందులో ఒక కుర్రాడు "రెండణాలకి పిప్పరమెంట్లు కావా"లని అక్కడ నిలబడివున్న ముసలి నౌకరును అడిగాడు. పిప్పరమెంట్ల సీసా అంగట్లో అటకమీద వున్న కారణంచేత, ఆముసలాడు లోపలి కెక్కడికో పోయి నిచ్చెన పట్టుకొచ్చి వేసుకొని దానిమీదగా ఎక్కి సరిగ్గా రెండు అణాలకి ఎన్ని పిప్పరమెంట్లు వస్తాయో అన్ని సీసాలోనుంచి లెక్కపెట్టి తీసి కిందికి దిగివచ్చి ఆకుర్రాడి చేతిలో పెట్టాడు.

ఇంతలో రెండో కుర్రాడు అందుకొని "నాకొక రెండణాల పిప్పరమెంట్లు యిమ్మ"ని జేబులోనుంచీ రెండణాలు తీసి బల్లమీద పెట్టాడు.

ముసలాడు మోకాళ్లు పట్టుకొని మళ్లీ నిచ్చెన మీదగా పాకి సీసాలోనుంచీ పిప్పరమెంట్లు తీసి దిగిరాబోతూ "నీక్కూడా కావాలా" అని ఆమూడో కుర్రాణ్ణి అడిగాడు. ఆకుర్రాడు తల అడ్డంగా తిప్పాడు-ముసలాడు క్రిందికి దిగివచ్చి పిప్పరమెంట్లు రెండో కుర్రాడి చేతికి యిస్తూ "ఐతే నీకేం కావాలి?" అని ఆమూడో కుర్రాణ్ణి అడిగాడు.

"ఎనిమిదణాలకి పిప్పరమెంట్లు యివ్వు" అన్నాడా మూడో కుర్రాడు.

## ★ జంతుకోటిలో మానవలక్షణాలు ★

టీగలన్నీ వర్తుల నృత్యాన్ని మాత్రమే చేశాయి. దూరంగా వుండే పూలలో మధువు దొరికిందని తెలియచేయటానికి ఎర్ర రంగు గుర్తుగా గల ఆజట్టు తేనెటీగలు కొంతదూరం సూటిగాఎగిరిఅక్కడ పొట్టను ఆడించే రెండోరకం నాట్యం చేశాయి. దీన్ని బట్టీ తేలిన సారాంశం ఏమంటే-దొరికిన మధువు దగ్గరలోవుందో, దూరంగా వుందో తెలియచేయటానికి తేనెటీగలు యీ రెండు రకాలనాట్యాలు చేస్తాయి.

ఈ అభిప్రాయం సరైందో కాదో నిర్ధారణ చేసుకోదలచి, నీలిరంగు గుర్తుగల తేనెటీగలు వాలే పూల మొక్కలు యిదివరకు తుట్టెకు దగ్గరగావుంటే, యీసారి దూరంగా తీసుకుపోయి, యిదివరకు ఎర్రరంగు గుర్తుగాగల తేనెటీగల ఆహార కేంద్రాలుగా పనిచేసిన రకం పూల మొక్కలను తుట్టెకు దగ్గరగా జరిపాడు. తేనెటీగలను వదిలిపెట్టాడు. తిరిగివచ్చిన తేనెటీగల్లో ప్రతిదీ, దగ్గరలోనే ఆహారం కనిపెట్టినదైతే, వర్తుల నృత్యం చేసింది. దూరంగా ఎక్కడో ఆహారాని కనిపెట్టి తిరిగివచ్చిన తేనెటీగ ప్రతిదీ రెండోరకం నాట్యం చేసింది.

ఇంతవరకు, తుట్టెలో వుండే తేనెటీగలు మధువు దొరికిన పూవు దగ్గరగా వుందో దూరంగా వుందో తెలుసుకోవటానికి ఏదిఆధారమో, మనకు బోధపడుతుంది. ఏరకం పూవులో ఆ మధువు వున్నదీ తెలియటానికి, అక్కడపోయి తిరిగి వచ్చిన తేనెటీగ వంటిమీదనుంచీ వచ్చే వాసన వాటికి ఒక సూచన. కానీ ఆపూవు తేనెతుట్టెకు ఏదిశగా వున్నదో వీటికి ఎల్లా తెలుస్తుందో, ఆవిషయాన్నిగూర్చి కొన్ని ఏండ్ల పాటు మరి కొన్ని పరిశోధనలు జరుపవలసి వచ్చింది. దిశను తెలియ చేయటానికి తేనెటీగలు సూర్యుణ్ణి ఆధారంగా తీసుకొంటాయి. మధు వుండే పూవు ఆకాశంలో సూర్యుడు వున్న వైపే సూటిగా వుండి వుంటే ఆవార్త తెచ్చిన తేనెటీగ తల పైకి ఎత్తి పెట్టి తుట్టెమ్మీదు పూవు వున్న దిశకే తిరుగుతూ నాట్యం చేస్తుంది. ఆపూవే గనక సూర్యుడు వున్న దిశకు కాక, అవతల వుండేట్లయితే, ఆవార్త తెచ్చిన తేనెటీగ తలక్రిందికి దించేసి ఆదిశలోనే నాట్యం చేస్తుంది.

పై అన్ని సంగతులని బట్టి మనలాగే, మిగిలనప్రాణులకీ, వార్తలు అందించుకోవటానికి భాష లేక పోయినా, ఏదో రకమైన సాంకేతికాలు వున్నట్లు తేటతెల్లమౌతున్నది.

(ఇంకా వుంది.)

# అనుమాన పిశాచం

శ్రీ అ. భాస్కరరావు

వెంకయ్య, వీరయ్య, సుబ్బయ్య మంచి స్నేహితులు. ఎక్కడికి పోయినా, ఏం చేసినా ముగ్గురూ కలిసే చేసేవాళ్ళు. ముగ్గురికి సమానమైన వుద్దేశ్యాలు; సరియైన ఆదర్శాలు; ముగ్గురికీ ఒక్కటే అదృష్టం కలసి వచ్చింది.

వీరితండ్రులు ముగ్గురూ స్నేహితులే; ముగ్గురూ మొదట్లో సేద్యం చేసి పొట్టపోసుకునేవారు. మొట్టమొదట వారు కలిసినప్పుడు మాత్రం, ఎవరికి వారికి భిన్నాభిప్రాయాలుండేవి. ఒకళ్ళ తరువాత ఒకళ్లు, అధికారగర్వంచేతనైతేనేమీ, అర్థబలంచేతనైతేనేమి, అంగబలంచేతనైతేనేమి, పరిస్థితులకు కట్టుబడిపోయి, చితికిపోయిన ఆప్తమిత్రులయ్యారు. ఒకరి తరువాత ఒకరు మిగిలిన కొద్ది ఆస్తులను కొడుకుల కప్పగించి, పరలోకానికి దారితీశారు. వారికి ముగ్గురుకీ ఒక్కొక్కడే కొడుకు. అదృష్టవశాత్తూ, తండ్రులకు నీడలుగా మెలిగిన వీరు ముగ్గురూ ఆప్తమిత్రులయ్యారు.

తిరిగి ఈ పుత్రరత్నాల దగ్గరి కొద్దాం. చెరి రెండెకరాల ఆస్తి వున్న ఆ మిత్రులు దినమంతా కష్టపడి గింజలు పండించుకొనేవారు. అయినా తిండికి తిప్పలు తప్పలేదు. అందువల్ల, అభిమానాలు, ఆదర్శాలు, పరువు, ప్రతిష్టలు వదులుకుని ఏ సంతర్పణలలోనైనా, వుచిత భోజనాలుపెట్టే చోట్ల ఎక్కడైనా సరే, వీరు తయారయేవారు. సుష్టుపూర్తిగా భోజనం చేసేవారు.

పాపం! వారిని చూస్తే పెట్టననడానికి ఎవరికీ మనసురాదు. అందుచేత వారికి ఎక్కడా తిరుగు ముఖం పట్టవలసిన అవసరం రాలేదు.

ఒకరోజున, ఆ వూరి పెద్ద ఆసామీ యింట్లో పెళ్ళిభోజనాలలో వీరు తయారయ్యారు. యథాశక్తి తంటాలు పడ్డారు. ఒకటి వేయమంటే నాలుగు వేసే ఆ వడ్డించేవాళ్ళ సరదా తీరేట్లు తిన్నారు. ఎంత ప్రయత్నించినా సుబ్బయ్య ధాటికి వెంకయ్య, వీరయ్య తట్టుకోలేకపోయారు. ఎక్కసంగా మెక్కి ఈ ముగ్గురూ ఇంటిదారి



# * అనుమాన పిశాచం *

పట్టారు. ఎక్కడి ఇల్లు! ఎక్కడి లోకం! ఇంకా మైలుదాకా నడవాలి. ఒక ప్రక్క భుక్తాయాసం, మరోప్రక్క చెడ్డ అలసట, ఎండ గాడ్పులూ.

"ఒరేయ్! వెంకూ! కూర్చుందాం రా కాసేపు" అన్నాడు వీరయ్య.

"అవునురా కూర్చుందాం" అంటూ బైఠాయించాడు సుబ్బయ్య.

ఇంకేంజేస్తాడు వెంకయ్యయినా! ముగ్గురూ చెట్టునీడని కూర్చుండి పోయారు. భుక్తాయాసం ఎప్పుడూ మనిషిని జోకొడుతుంది. దానికి తోడు చల్లనిగాలి కూడా మేను సోకుతున్నదేమో - సుబ్బయ్య, రెప్పలు వాల్చబోయాడు.

"ఏరోయ్! పడకేస్తున్నావు?" అన్నాడు వెంకయ్య.

"కాకేమిటోయ్? నిద్దర ముంచు కొస్తూంటే" దబాయించాడు సుబ్బయ్య.

"ఒరేయ్ - పగలు భోంచేశాక నిద్రపోతే జ్వరం వస్తుందిరా! ...లే! లే!" అన్నాడు వీరయ్య.

"అవును నిజమేరా!" అని తంథానా పలికాడు వెంకయ్య.

"ఏడిచారు—"అని పైకి దబాయించినా సుబ్బయ్యకి మనస్సులో అనుమానంగా ఉంది. ఆ అనుమానం పైకి కనపడనీయకుండా అణిచేయడానికి నిద్ర నటించుదామనుకుని కళ్లుమూసుకున్నాడు సుబ్బయ్య. కొద్దిసేపు కునికాడు. వెధవ కలొకటి మెళుకువ తెప్పించింది. లేచి చూసేప్పటికి వాళ్లిద్దరూ ఏదో మాట్లాడుతున్నారు.

"మా నాన్న మొదట్లో పెద్ద ఆఫీసరు. తరువాత పాపం-లంచాలు తీసుకున్నాడని ఆయన్ని డిస్మిస్ చేశారు. చిన్నవుద్యోగాల కెళ్లడం ఇష్టంలేక వున్నపొలం చూచుకో సాగాడు. ఎంతకాలమని తింటూ కూర్చుంటాడా ఆస్తితో? అప్పుడు కొంత, అప్పుడు కొంతగా అంతా ఆస్తి, హరించింది. ఆ బాధతోనే పాపం పోయాడు." అని కన్నీరు కార్చాడు వెంకయ్య.

"అవునురా! అవును. మా నాన్న చెబుతూండేవాడు. మా నాన్న ప్రభ అంతా ఆయన కుర్రాడుగా ఉన్నప్పుడే. ఎక్కే గడపదిగే గడపతో ఆయన కాళ్లైగాక, ఉన్న ఆస్తంతా అరిగిపోయింది. పాపం ఆయనకి డాన్సులంటే తగనియిష్టం కొత్తల్లో. డాన్సుల్లోంచి డాన్సర్సు మీదకి ఏనాడు ఆయన దృష్టి పోయిందో, ఆనాడే ఆయన ధనం క్షీణించడం మొదలెట్టింది. ఆస్తీ పోయి, ఆరోగ్యమూ పోవడంతో క్షీణించి పోయారు!" అంటూ పైగుడ్డతో కళ్లునలుపుకున్నాడు వీరయ్య. ఆ యిద్దరికథా వినంగానే తనకూ చెప్పడానికి తండ్రివిషయాలు గుర్తుకొచ్చాయి, సుబ్బయ్యకి. వెంటనే లేచాడు.

"మా నాన్న మాంచి ఫైల్వాను. ఎందరెందరో ఆయన ధాటికి తట్టుకోలేకపోయేవారు. ఆయన భుజబలం అంతా పొగిడేవారు. ఎంత డబ్బు సంపాదించినా అదంతా ఆయన తిండికే సరిపోయేదికాదు. ఒకసారి ఎవరితోనో మాట్లాడుతూ పంతంమీద గెల అరటిపళ్లు, ఇరవై కోడిగుడ్లు తిని పది కప్పుల కాఫీ తాగాట్ట—ఒక్క రోజున పాపం!—"యిక చెప్పలేక పోయాడు. సుబ్బయ్యకి దుఃఖం పొంగివచ్చింది. కొద్దిగా తమాయించుకుని,

"నలభై బ్రెడ్లు తినమని పందెం వేస్తే-పాపం అన్నీ తిన్నాడుట-నెగ్గినతర్వాత అలసట తీర్చుకుంటూ ఉండగా నిద్రపట్టిందిట-బాగా నిద్రపోయి లేచిన ఐదునిముషాలకే పాపం గుండెఆగి..."వాక్యం పూర్తిచేయలేక సుబ్బయ్య భో... భో...అని ఏడ్చాడు.

"అవును—పోయాడు పాపం—మాకూ తెలుసు. అందుకే నిద్రపోవద్దంటారు, బాగా ఏమైనా తిని-అందుకేగా నీతో మేమిట్లా చెప్పింది-అదృష్టవంతుడివి. సమయమే- నిద్రపోతానన్నావు నువ్వు—" అంటూ సానుభూతి, చూపుతూ వారన్నదాన్ని సమర్థించుకున్నారు సుబ్బయ్య మిత్రులు.

"లేరా పోదాం!" అంటూ లేపేశారతన్ని. ముగ్గురు మిత్రులు లేచారు, తిన్నగా ఎవరిళ్లకు వాళ్లు వెళ్లిపోయారు.

సుబ్బయ్య యింటికి వచ్చాడన్నమాటేగాని మనస్సు మనస్సులో లేదు. తండ్రిసంగతే తడవతడవకీ జ్ఞాపకానికి వస్తోంది. తండ్రి తిని,నిద్రపోయి పోయాడు. స్నేహితులిద్దరు కూడ చెప్పారు నిద్రపోవద్దని. కాని తను పంతంకోసం నిద్రపోతున్నట్లు నటించబోయి కునికాడు. తనకే

(54-వ పేజీ చూడండి)

# పోస్టుజవాను

## పిల్లల నాటిక

(కామేశ్వరరావు గారి యిల్లు. ముందు వరండాలో పంతులు గారి పిల్లలు హరి, సోము, పక్కింటివారి సీత, యశోద ఆడుకుంటుంటారు. పోస్టు జవాను రంగంమీదకు వచ్చి నిలబడుతాడు. సమయం ఉదయం తొమ్మిదిగంటల ప్రాంతం).

హరి : లక్ష్మి; నిన్న బళ్ళోకి రాలేదేమే? వంట్లో బాగా లేదా?

శ్రీ బి. శ్రీహరిరావు

లక్ష్మి: లేదోయి. పట్నం నుంచి మా నాయనమ్మ వచ్చింది.

సోము : అవునులేగానీ నాయనమ్మ వస్తే బడిమానేయటమే?

యశోద: లేకపోతే ఆమె తెచ్చేవన్నీ తమ్ముళ్ళు, అక్కయ్యా లాగేస్తారోయ్! సమయానికి యింట్లోవుంటేనే మన చేతుల్లో ఏదైనారాలేది.

హరి : అయితే ఏం తెచ్చిందేం నాయనమ్మ ?

లక్ష్మి : నాలుగు చక్రాల మోటారుబండి, బుల్లి బుల్లి బెంగుళూరు గాజులట, ఎం చక్కగా వున్నాయనుకున్నావు!

యశో : హరికి కూడ తీసుకు వచ్చి యివ్వాలిసిందే నే!

లక్ష్మి: నిజంగానే మర్చిపోయా, ఆనక్క తీసుకురానా సీతకూడా.

సోము : మగపిల్లలు గాజులు తొడుక్కుంటారేంటే?

మళ్లీ తీసేయరా హరీ, చక్కగా వుంటావు.

యశోద : కాసేపు తొడుక్కుని

(52వ పేజీ చూడండి)






**జరిగిన కథ:**—శ్వేతాంక మహారాజుకి లేక లేక ఒక కూతురు పుట్టింది. ఆ అమ్మాయి నామకరణ మహోత్సవానికి తమని పిలవలేదనే కోపంతో 'క్రోధి' అనే దేవత, ఆపిల్ల తల బట్టతలగా వుండి పోతుందని శపించింది. శ్వేతాంక మహారాజు గారికి ఎప్పుడో ఆయన పెద్ద తల్లిగారు ఒక వరం యిచ్చింది; ఆయన ఆవరాన్ని అమ్మాయికి యిచ్చాడు. సుకేశిని అన్న పేరుతో పెరిగి పెద్దదైన ఆ అమ్మాయి తనకి బోలెడంత జుట్టు కావాలనీ, ఆజుట్టు రోజుకు రెండు అంగుళాల చొప్పున పెరగాలనీ, కత్తిరించి నప్పుడల్లా అంతకు రెండింతలు వేగంగా పెరగాలనీ, కోరుకొంది. ఆ ప్రకారమే జరిగింది కానీ, అంతులేకుండా పెరిగిపోయిన ఆజుట్టు మూలంగా ఆ అమ్మాయికే కాక, అంతఃపురంలోని వారందరికీ యిబ్బంది కలిగింది. ఎలాగైనా సరే రోజు రోజుకీ పెరిగిపోతున్న యీజుట్టుని పెరిగిపోకుండా చేయగల రాజకుమారులు ఎవరైనా వుంటే, వారికి యీ అమ్మాయిని యిచ్చి పెళ్లి చేస్తానని మహారాజుగారు చాటింపించారు. ఎందరో రాజకుమారులు వచ్చి ప్రయత్నించారు కానీ, ఫలితం లేకపోయింది. చివరికి ఒకరోజు వెన్నెల రాత్రి ప్రతాపసింహుడనే రాజకుమారుడు సుకేశిని మందిరం క్రింద తిరుగుతూ ఆమె కంట బడ్డాడు.

(గత సంచిక తరువాయి)

క్రింద నిలుచుండి పోయిన ప్రతాపసింహుడు కొంతసేపు అలాగే ఆశ్చర్యంగా చూస్తూ "సుకేశినీదేవి మీరేనా?" అని అడిగాడు.

"అవును" అని రాజకుమారి సమాధానం యివ్వగానే ప్రతాపసింహుడు పైఅంతస్థు కిటికీ దాకా ప్రాకివున్న పూతీగ మీదగా ఎగబాకి వెళ్లి కిటికీలోనుంచి అంతఃపురంలోకి దిగాడు.

"మీతండ్రి చాటించిన విధంగా నేను నీకీ జుట్టుబాధ లేకుండా చేస్తే, నన్ను నువ్వు పెళ్లాడుతావా?" అని అడిగాడు.

"ఈ జుట్టుబాధ ఎవరైతే పోగొట్టుతారో వారిని నేను పెళ్లాడవలసి వుంటుందని మానాన్నగారే నిర్ణయించారు కదా?" అంటూ సుకేశినీ దేవి నునుసిగ్గుతో చిరునవ్వులు ఒలకబోస్తూ సమాధానం యిచ్చింది.

"అలాగైతే యీ వేళ నేను చెప్పినట్లు చేస్తావా?... ఈ వేళ రాత్రి మామూలుగా పక్కమీద పడుకొని నిద్రపోకుండా, యిక్కడే యీ కిటికీదగ్గరే కూర్చో. నీజుట్టు అంతా పెరిగిపోయి, యీగది అంతా పూర్తిగా నిండిపోయాక నాకు సంజ్ఞ చేయి. నేను యిక్కడే యీకిటికీ కింద తోటలో కాచుకు కూర్చుంటాను. సరేనా?" అన్నాడు.

సుకేశిని సరే ననగానే దబదబా పూతీగ మీదగా క్రిందికి దిగివచ్చి తోటలోనే అటూయిటూ తిరుగుతూ గంటలకొద్దీ కాలం గడిపాడు.

రాత్రి అంతా గడిచిపోయి, తూర్పున తెల్లరేకలు ఆడుతూ వుండగా సుకేశిని, పైన కిటికీలోనుంచీ కేక వేసింది-

"ఓ రాజకుమారుడా! నాజుట్టు పెరిగిపోయింది. గదిఅంతా నిండిపోవటమే కాదు నన్నిక్కడినుంచీ పడతోసేస్తుంది కూడాను." అని.

"అలాగైతే వెంటనే కిటికీలోకి ఎక్కి ఆపైగా కనుపించే ఆ యినప కొక్కానికి నీజుట్టు చుట్ట

చెప్పేయ్. నేనిదే వచ్చేస్తున్నాను." అంటూ ఒరలోనుంచీ కత్తి లాగేసి పళనందున గట్టిగా పట్టుకొని ఫ్రాదీగమీదగా గబగబా పాకి పోయాడు. పైదాకా పోయాక రాజకుమార్తె తలమీదనుంచీ గజం పొడుగు వరకు జుట్టు వదిలిపెట్టి అక్కడ ఆజుట్టు నంతటినీ మెలిపెట్టి గుప్పిటతో గట్టిగా పట్టుకొని, "కిటికీలోనుంచీ క్రిందికి దూకెయ్యి" మని రాజకుమారికి హుకుం వేశాడు.

సుకేశిని వేరే సంకోచం ఏమీ లేకుండా దూకెయ్యటమైతే దూకేసింది కానీ, తీరా గాలిలో వేళ్లాడవలసి వచ్చేసరికి భయంవేసి కెవ్వున కేక వేసింది. ప్రతాప సింహుడు మాత్రం ఏమీ చలించకుండా ఆమె జుట్టు గట్టిగా పట్టుకొని గజన్నర వరకు అట్టేపెట్టి అక్కడ తన కత్తితో కోసి పారేశాడు. ఆజుట్టు అల్లానే పట్టుకొని ఆమెని నింపాదిగా నేలమీదికి దించాడు.



నేలకి కాలు తగిలాక సుకేశిని తన కేశాలని చూసుకొని, దాంతో తనబాధ విరగడై పోయినంతగా సంతోషిస్తూ, ఆ తోటలోనే ప్రతాపసింహుడితో అవీ ఇవీ మాట్లాడుతూ మట్ట మధ్యాహ్నం అయ్యేదాకా తిరిగింది. అప్పటికి ఆకలి విషయం జ్ఞాపకంవచ్చి, రాజకుమారుణ్ణి వెంట బెట్టుకొని అంతఃపురంలోకి వెళ్లింది.

అప్పటి కప్పుడే అంతఃపురమంతా మంత్రులతోనూ, సామంతులతోనూ రాజబంధువులతోనూ, దాసదాసీ జనాలతోనూ కిటకిటలాడి పోతున్నది. వాళ్లలో ప్రతి ఒక్కరికీ కూడా రాజకుమారి జుట్టుని ప్రతాప సింహుడు నాటి రాత్రే కత్తిరించేసినట్లూ, అప్పటి నుంచీ ఆజుట్టు పెరగటం ఆగిపోయినట్లూ తెలిసి, ఎవ్వళకు మటుకు వాళ్లకుఏదో పెద్ద సమస్య తీరిపోయినట్లు తేలికగా తిరుగుతున్నారు. శ్వేతాంక మహారాజు ప్రతాప సింహుడికి ఎదురువచ్చి "ఈఅద్భుత కార్యం ఎల్లా చెయ్యగలిగావు నాయనా?" అని ఎంతో కౌతుకంతో అడిగాడు.

"అందులో అద్భుత మేమున్నదండీ? ఇంతవరకూ ఎవరు ప్రయ




ధ్యానబుద్ధుడు—(పెంటిగీత బొమ్మ)

—మిస్. బాల (విజయవాడ)

# ★ సుకేశిని కేశవృత్తాంతము ★

త్రించినా రాజకుమారికీ ఆజుట్టుకీ సంబంధం లేకుండా చేయాలని చూశారు. నేను మాత్రం ఆజుట్టుకీ రాజకుమారికీ సంబంధం తెగి పోయేలా చూశాను." అన్నాడు.

రాజుగారి. ఆనందానికి, ఆశ్చ ర్యానికీ అంతు లేక పోయింది. ప్రతాప సింహుడి గౌరవార్థం రాజుగారు పెద్ద విందు జరిపించారు. విందులో అందరితో పాటే కూర్చున్న సుకేశిని, విందు అయ్యాక కూర్చుని లేచేసరికి, అదేమిటో అందరికంటే ఎత్తుపెరిగి పోయినట్లు కనిపించింది. ఆ పెరిగి పోవటం, పెరిగిపోవటం ఒక్క సారిగా తొమ్మిది అడుగుల పొడుగై పోయింది.

రాజుగారి గుండెల్లో రాయి పడ్డది. "మళ్లీ యిలాటిదేదో వచ్చి పడుతుందని నేను అప్పుడే అను కొన్నాను. ఈవరసను చూస్తే మన అమ్మాయి మరికొన్ని గంటల్లో ఆకాశం అంత పెరిగి పోయేలా వున్నది" అంటూ, ప్రతాపసింహుడి వైపు తిరిగి, "చూడు నాయనా! జుట్టును వేరు చేస్తే జుట్టే పెరిగింది: ఇప్పుడు రాజకుమారిని దూరం చేయబోతే యీ రాజకుమారే పెరిగి పోతోంది. ఇప్పు డేం దారి?" అని అడిగాడు.

వీళ్లీ వరసను తలక్రిందు లౌతూ వుంటే, అక్కడ ఆ రాజకుమారి ఆగకుండా పెరిగిపోతూనే వుంది. ఇంక కాసేపట్లో అంతఃపురం పైకప్పుకూడా దూసుకుపోయేలా వుంటే, పదిమందీ కలసి సాయంబట్టి ఆమెని వెంటనే ఆరుబయట వుద్యానవనంలోకి తీసుకొచ్చి కూర్చో పెట్టారు.

అంత ఎత్తు పెరిగిపోయినందు వల్ల ఆ అమ్మాయి అన్నం తిన టానికిగానీ, నీళ్లు తాగటానికిగానీ, ఏపని చేయటానికి గానీ వీలు లేకుండా పోయింది. కొత్తగా వచ్చి

పడిన యీ బాధను తలుచుకు తలుచుకు ఆ అమ్మాయి ఏడ్వటం మొదలుపెట్టింది. అంత ఎత్తు ఎదిగిపోయిన అమ్మాయి ఏడుస్తూ వుంటే, ఆ అమ్మాయి కళ్లవెంట కారేనీరు అంతా పెద్ద కొండమీది నుంచీ క్రిందికి దూకే జలపాతంలా కుమ్మరించి నేలమీదనే తారట్లాడుతున్న ఎందరో సేవకులు కొట్టుకుపోయారు. అయితే యిందులో ఒక్క సుకృతంమాత్రం వుంది- ఆ అమ్మాయి మామూలు ఎత్తు వున్నప్పుడు ఆ అమ్మాయి వంటిమీద ఏ దుస్తులైతే వున్నాయో ఆదుస్తులే మనిషితోపాటు ఎదిగిపోయాయి. లేకపోతే - ఎప్పుడో ఆదుస్తులన్నీ పిగిలిపోయి, యీ మనిషి దిశమొలతో పెద్ద పర్వతంలా ప్రత్యక్షమయ్యేదే!

అమ్మాయికి పట్టిన ఒక అవస్థ తీరింది కదా అని ఆనందిస్తూవుంటే, మరొకరకమైన ఆపద ముంచుకు వచ్చినందుకు రాణీ కాళిందీ దేవి కన్నీరు మున్నీరుగా ఏడ్చేసింది. తన తెలివితేటల నంతటిని వుపయోగించి సుకేశినీదేవికి పట్టిన రోమ బాధను తొలగించాను కదా అని పొంగిపోతున్న ప్రతాప సింహుడికి యీక్రొత్త సమస్య వచ్చి పడటంతో తల తిరిగిపోయి నట్లైంది. శ్వేతాంక మహారాజుమాత్రం తను మనస్సులో పడుతున్న ఆవేదన అంతటినీ పైకి పొంగిరానీయకుండా అణిచి పెట్టుకొని, అంతఃపురంలోకి పోయి పెద్దతల్లిగారి కీ విషయాన్నంతా తెలియచేసి, ఆమెసలహాని కోరుతూ పెద్ద జాబు ఒకటి వ్రాసి, రెక్కల చేపకి యిచ్చి వెంటనే సమాధానం పట్టుకురమ్మని పంపించాడు.

పెద్దతల్లిగారి వూరికి వెళ్లిన చేప కొద్ది క్షణాలలోనే తిరిగివచ్చి, మొఖం వేలవేసి ఆమె అక్కడ లేదనీ, ఎక్కడికి వెళ్లిందీ కూడా ఎంత భోగట్టా చేసినా తెలియ లేదనీ చెప్పి వూరుకొంది.

శ్వేతాంక మహారాజూ, ఆయన మంత్రులూ యీ విధమైన సమస్యలతో తలక్రిందులౌతూవుండగా పొరుగు రాజు ఒకడు యీ విషయాన్నంతటినీ తెలుసుకొని, యిదే మంచి అదను అనుకొని, యీ రాజ్యంమీదికి పెద్ద సైన్యాన్ని పడవల్లో ఎక్కించి పంపించాడు.

ఆకాశంఅంత ఎత్తున పెరిగిపోయివున్న సుకేశినీ దేవికి పరాయి సైన్యాలు తమ రాజ్యంలో పడవల మీదవచ్చి దిగటం కంటపడింది. తండ్రిగారి రాజ్యానికి ఎటువంటి ముప్పు ముంచుకువస్తున్నదో వెంటనే గ్రహించి, కబంధుడి చేతుల్లా పది ఆమడల దూరం పెరిగిపోయిన తన చేతుల్ని చాపి, నేలమీదికి దిగిన సిపాయీల నందరినీ గుప్పెళ్లతో పట్టి పైకెమెత్తి మళ్లీ వాళ్ల వాళ్ల ఓడల్లోనే పడేసి, 'వుఫ్' అని వూదేసింది. ఆగాలి తాకిడికి యుద్ధ నౌకలన్నీ సుడిగాలిలో కొట్టుకుపోయే ఎండుటాకుల్లా నీటిలో బడి కొట్టుకెళ్లాయి.

శ్వేతాంక మహారాజుగారి రాజ్యాన్ని వశపరుచుకురమ్మని పంపించిన సైన్యాలు యిలా గాలికి కొట్టుకు వచ్చేసరికి, ఆదేశపు రాజు వాళ్లందరినీ మొఖం వాచేటట్లు చివాట్లు పెట్టాడు. 'కావాలంటే కఠిన శిక్షలైనా అనుభవిస్తాము కానీ, మా బొందిలో ప్రాణాలు వుండగా మళ్లీ, ఆరాజ్యం జోలికి మాత్రం పోము'ని ఆసైనికు లందరూ ఏక కంఠంతో మొఱ పెట్టుకొన్నారు.

ఇక్కడ సుకేశినీ నింపాదిగా కదిలి పెద్ద పర్వతశిఖరాన్నే ఒక పీటలా చేసుకొని దానిమీద కూర్చుంది. అలా కాస్సేపు కూర్చుందో లేదో, ఆమె కాళ్లకింద భూమి ఏమిటో కుంగిపోతున్నట్లు తోచింది.

"ఓహో! దెయ్యంలా యింత ఎత్తు పెరగటమే కాకుండా, శరీరం బరువు కూడా ఎక్కువౌతున్నట్లున్నదే?" అని ఆరాజకుమారి ఆందోళన పడి, యిక యిది పని గాదని సముద్రంలోకి పోయి నిల్చున్నది. అంతలోతు సముద్రంలోనూ, నీళ్లు ఆ అమ్మాయి చీలమండల దాకా మాత్రమే వచ్చాయి. అక్కడ నిల్చుని సముద్రం మీద అన్ని వైపులకీ ఒక్కసారి పరీక్షగా చూసింది. తీరా చూస్తే-ఆ విరోధి రాజ్యంనుంచి భయంకరమైన యుద్ధనౌకలు ఫిరంగులు బిగించుకొని మహా పటాటోపంగా అప్పుడే బయలుదేరుతూవుండటం ఆమె కంటపడింది. ఎంతపెద్ద నౌకలైనా ఆ అమ్మాయి తల్చుకొంటే ఒక్క తన్నుతో అన్నిటినీ ఒక్కసారిగా ముంచెయ్యగలదు. కానీ అంత మంది నావికులను ఒక్కసారిగా హతమార్చేసి పాపం ఒడిగట్టుకోవటం ఎందుకులెమ్మన్న ఆలోచన కలిగి, ఆపని మాత్రం చెయ్యలేదు.

# ★ సుకేశిని కేశవృత్తాంతము ★

తన తండ్రి తాలూకు రాజ్యం వున్న ఆ భూభాగా న్నంతటినీ కలిపి వున్న పళంగా పెకలించి వేసి, అరచేత్తో పట్టుకొని సముద్రంలో దూరంగా నడుచుకొంటూ పోయింది. శ్వేతాంకుడి రాజ్యం మామూలుగా వుండవలసిన చోటికి ఆ యుద్ధ నౌకలు పెద్ద సంరంభంతో వచ్చి చూస్తే, అక్కడ ఆ రాజ్యమే లేకుండా మాయమైపోయింది.

యుద్ధనౌకల్లోని సేనానాయకు లందరూ యీ విచిత్రాన్ని చూసి ఆశ్చర్యపడ్డారు. తమవద్ద వున్న దేశ పటాలన్నిటినీ పోగుచేసి ఒక దానితో ఒకటి సరిపోలుతున్నాయో లేదో చూసుకొన్నారు. సముద్రంలో తాము సరైన మార్గాన్నే వచ్చారో లేదో అని మరొకసారి సరిచూసుకొన్నారు. ఎన్నిమార్లు లెక్కలు వేసి చూసినా ఏలోపమూ కనిపించలేదు కానీ, ఆ రాజ్యం మాత్రం అక్కడ లేకుండా పోయింది. ఎక్కడికి పోయిందో ఎలా పోయిందో వాళ్ల వూహాకు అందలేదు. వీళ్లీ వరసను తికమక పడుతూ వుంటే, అవతల ఎక్కడో ఆ రాజకుమారి కదులుతున్న కారణంచేత సముద్రంలో పెద్ద కదలిక కలిగి, పెద్ద పెద్ద తరంగాలు లేచాయి. ఆ తరంగాల తాకిడికే వీళ్ల పడవలన్నీ తల్లక్రిందులైనాయి.

తండ్రి రాజ్యం వున్న భూభాగాన్ని పట్టుకుపోయిన సుకేశిని సముద్రంలో గుండా నడుచుకుంటూ ఎక్కడికో పోయి, తిమింగిలాలు, సుడిగుండాలు లేనిచోటుగా చూసి, అక్కడ ఆగడ్డను దించేసింది. ఆగడ్డపై వుండే జనం అందరూ కలిసి గడ్డకొట్టుకుపోకుండా సముద్రంలో అన్ని వైపులకీ లంగర్లు దించి బిగించి కట్టారు. తనకు తాను అంత ఎత్తూ, బరువూ పెరిగిపోయి వుతుకుష్టపడుతూకూడా తమ రాజకుమారి, యీ విధంగా రాజ్యాన్ని శత్రువుల చేతుల్లో పడకుండా చేసి, తమ అందరి ప్రాణాలను కాపాడి

సందుకు, ఆ రాజ్యంలో ఆబాల గోపాలమూ సుకేశినీ దేవిని వెయ్యి విధాల మెచ్చుకొన్నారు.

స్వదేశానికి యింత పెద్ద మేలు చెయ్యగలగటం బాగానే వుంటుంది కానీ, అన్ని మైళ్ళ ఎత్తున పెరిగిపోయి ఆకాశంలోకి చొచ్చుకు కూర్చుని పిలిస్తే పలికే వాళ్ళు లేక, తిండి తినటానికీ నీళ్ళు తాగటానికి వీలులేని విధంగా బ్రతికి వుండటం మాత్రం ఎవరికైనా మహా యాతన!

ఆవిడ మనస్సు యీ మాదిరి ఆలోచనలతోనే నాటి పగలంతా కలత చెందింది. అలాగే ప్రొద్దుకూడా గ్రుంకింది. ఏమి చేయటానికీ తోచక సముద్రంలోనే నడిచివచ్చి తన పూర్వపు అంతఃపురం మీదికి వంగి, మామూలుగా అందరి మనుష్యుల ప్రమాణంలోనే తాను వున్నప్పుడు అప్పటి ఆసుఖమయ దినాలను తలుచుకొని వల వల ఏడ్వటం మొదలుపెట్టింది. ఆసమయంలో ఆవిడ కార్చిన కన్నీటికి అంతులేదు. ఆ కన్నీటి వానలన్నీ అదృష్టవశాత్తు సరాసరి సముద్రంలోనే కురిశాయి కాబట్టి సరిపోయింది కానీ, భూమిమీద గనుక పడివుంటే ఎంతెంత పెద్ద వరదలు వచ్చి ఎన్ని దేశాలు, ఎన్ని రాజ్యాలు కొట్టుకుపోయేవో చెప్పలేం కదా!

అప్పటికి బాగా చీకటిపడి ఆకాశంలో నక్షత్రాల కాంతి హెచ్చింది. సుకేశిని నిరాశతో బరువుగా తల పైకెత్తి ఆనక్షత్రాలకేసి చూసింది. "ఈ ఎదగటం యింతటితోనైనా ఆగకపోతే, యిక కొద్ది రోజుల్లోనే నా తలకాయపోయి ఏ నక్షత్రానికో కొట్టుకొంటుంది. తప్పదు" అని మనస్సులోనే అనుకుని వేడి నిట్టూర్పులు విడుస్తోంది. ఆవిడ ఆస్థితిలో నిలబడి వుండగా, కుడి చెవ్విలో చేరి ఎవరో గుస గుస లాడుతున్నట్లు తోచి, తదేక దీక్షగా విన్నది. చెవిలో దూరిన ఆగొంతుక "నీజుట్టు కత్తిరించేసుకో...జుట్టు కత్తిరించేసుకో!" అని ఒకటే తొందర చేస్తున్నది. ఈ సలహా యిస్తున్నది ఎవరై వుంటారా అని ఆగొంతుకను పరీక్షగా విన్నది. అది ప్రతాప సింహుని కంఠ స్వరమే! ఆవిడ ఆశ్చర్యానికి అంతులేదు.

మామూలు మనిషిగా వున్నప్పుడుకూడా జుట్టు పీడ లేకపోయినా ఆవిడ తనదగ్గిర ఎప్పుడూ ఒకబంగారపుకత్తెర అట్టే పెట్టుకొనేది. ఆవిడ శరీర ప్రమాణంతోపాటు దుస్తులూ అవీ అన్నీ పెరిగిపోయాయి కదా! వాటితోపాటు యీకత్తెర కూడా పెద్ద బ్రహ్మాండమంత పొడుగైపోయింది. అట్లాంటి ఆ కత్తెరని పైకితీసి దాంతో ఆవిడ తన జుట్టుని అందినంతమటుకు అంట కత్తిరేసుకొంది. ఆవిడ కత్తిరించగా రాలిన వెంట్రుకలన్నీ సముద్ర జలాల్లో పెద్ద దూలాల్లా పడి దూరంగా కొట్టుకుపోయాయి. ఒక్కొక్క వెంట్రుకనీ కొన్ని వేల పగడపు పురుగులు పట్టుకొని, ఆ వెంట్రుకల ఆధారంతో ఎన్నో పగడాల దీవులు కట్టేశాయి. ఆపగడాల దీవులన్నీ ఏమయ్యాయో, వాటి మీద ఎటువంటి కథలు నడిచాయో అదంతా మనకథకి అనవసరం.

జుట్టు కత్తిరించటం పూర్తి అయ్యాక "మనదీవికి దగ్గరగా కదుల"మని ప్రతాపుడి కంఠస్వరం సుకేశిని చెవులో గుయ్ గుయ్ లాడింది. సుకేశిని సముద్రంలో నడిచి ఆ దీవికి దగ్గిరగాపోయి మరొకసారి ఆకాశంకేసి చూసింది - తన తల నక్షత్రాలను తాకుతున్నదేమోనని. కానీ నక్షత్రాలు యింకా చాలాదూరాన వున్నట్లే తోచింది. ధరవాతేటు తెప్పరుకొన్నది.

"సముద్రంలో పడుకొని యీదటం మొదలుపెట్ట"మని ప్రతాప సింహుడి కంఠస్వరం మళ్ళీ సూచించింది.

ఆ సూచన మేరకు సుకేశిని సముద్రంలో యీదటం మొదలుపెట్టింది. ఆమె ప్రక్కగానే ప్రతాప సింహుడూ పడి యీదుతూనే యిలా అన్నాడు: "మరేమీ లేదు. నువ్వు మా రాజ్యం వున్న భూభాగాన్ని పెల్లగించి పట్టుకపోతూవుండగా, నేను నీ చేతి ఆసరా చూసుకొని, దానిమీదగా పాకి నీ భుజంమీద ఎక్కికూర్చుని, నువ్వుపడే అవస్థఅంతా చూస్తూ వున్నాను. అంతపెద్ద దానివైయుండి నేను వంటిమీద నల్లిపాకినట్లు పాకుతున్నా, నువ్వు గమనించనే లేదు. నీచెవిలో దూరి బాకాపెట్టి వూదితే కానీ, నేను చెప్పిందైనా నీకు వినిపించింది కాదు."

"అయ్యో! అల్లాగా? నాకు ఏమాత్రము తెలిసింది కాదే!" అంటూ సుకేశిని సిగ్గుపడింది.

# ★ సుకేశిని కేశవృత్తాంతము ★

కొంతసేపాగి "నా ప్రాణం కాపాడావు! నీకేమి యిచ్చి నీఋణం తీర్చుకోగలనో తెలియటం లే. అరె! నేను మామూలు మనిషినై పోయానే!" అంటూ ఆశ్చర్యం పట్టలేక అతనిమీద వాలిపోయింది.

అక్కడనుంచీ వాళ్లిద్దరూ ఒడ్డుకు వచ్చేసి, కాలినడకను పోయి శ్వేతాంక మహారాజుగారి మందిరంలో ప్రవేశించారు. పర్వతమంత ఎత్తు పెరిగిపోయిన అమ్మాయి, మళ్లీ మామూలు మనిషై ప్రియుణ్ణి వెంటబెట్టుకు రావటం చూసి, రాజూ, రాణీ, బంధుమిత్రులు అందరూ ఆనందాశ్రువులు కార్చారు.

ఈ ఆనందోద్రేకాల వెల్లువ తగ్గకముందే సుకేశిని కేశాలు మళ్లా యథాప్రకారం పెరిగి పోతూ వుండటం శ్వేతాంక మహారాజుగారి కంట బడింది. క్షణం క్రితం ఆనంద పారవశ్యంతో తేలిపోతున్న ఆయన మనస్సులో పిడుగులవర్షం కురిసింది.

"నాయనా! ప్రతాపసింహా! పరిస్థితి మళ్లీ మొదటికి వస్తోంది. అమ్మాయి జుట్టు చూడు - క్షణక్షణానికి ఎలా ఎదిగిపోతున్నదో!" అన్నాడు.

నిజమే-ఆ అమ్మాయి జుట్టు ఎడతెరిపి లేకుండా ఎదిగిపోతున్నది.

ఏం చెయ్యటానికీ ఎవరికీ దిక్కు తోచటంలేదు. అందరూ విచారగ్రస్త వదనాలతో జీవంలేని ప్రతిమల్లా చూస్తూ వుండిపోయారు.

శ్వేతాంక మహారాజుగారే ఎట్టకేలకు తెప్పరిల్లినవారై, తన పెద్దతల్లిగారి పేరట, పరిస్థితినంతా వివరిస్తూ, సలహాకై ప్రార్థిస్తూ, సుదీర్ఘమైన లేఖ ఒకటి వ్రాశారు. ఆలేఖను యీసారి ఎగిరే చేవ చేతికి యిచ్చి పంపించారు.

కొద్ది క్షణాలలోనే ఆచేవ తిరిగి వచ్చింది. పెద్ద తల్లిగారు యిచ్చిన సమాధానాన్ని రాజుగారి చేతిలో పెట్టింది. రాజుగారా వుత్తరాన్ని విప్పి చదివారు. అందులో యిలా వుంది:

"నేనీ మధ్య యాత్రలకి వెల్లి వచ్చాను. క్రిందటిసారి మీజాబు వచ్చే సమయానికి నేనిక్కడ లేకపోయినందుకూ, మీరందరూ అమ్మాయి జుట్టు మూలంగా అంతంత బాధపడవలసి వచ్చినందుకూ చాలా విచారించాను. ఆ సమస్యాపరిష్కారానికి త్రాసును వుపయోగించవలసిందిగా సలహా యిస్తున్నాను."

అమ్మాయి జుట్టుకీ, వస్తువులని తూచే త్రాసుకీ సంబంధం ఏమిటో యీరెంటినీ ఎలా ముడిపెట్టాలో రాజుగారికి ఎంత ఆలోచించినా బోధపడలేదు. మంత్రులు, సామంతులు, ప్రభుత్వాధికారులు అందరూ కలిసి వారాల తరబడి చర్చించి, తలలు బద్దలు కొట్టుకొని ఆలోచించారు. ఊహూ!— వాళ్లకి యేమీ అంతు చిక్కలేదు.

ఈలోగా ప్రతాపసింహుడు శ్వేతాంక మహారాజుగారితో చెప్పి, పెద్ద బంగారు త్రాసు ఒకటి చేయించి, రాజోద్యానవనంలో పెద్ద మర్రిచెట్టు ఒకటి వుంటే, దాని కొమ్మలకి యీ త్రాసుని వేలాడగట్టించాడు. ఈపని అంతా పూర్తి అయ్యాక ఒకనాటి వుదయం సుకేశిని వుండే మందిరంలోకి వచ్చి "సుకేశినీ! నీతో చాలా ప్రధానిమైన విషయాలను గూర్చి మాట్లాడుదామని వచ్చాను. కాలం యిలా వృథాగా గడచిపోవటం నాకు బాగలేదు. నావయస్సు అప్పుడే పాతికేళ్లు మించిపోతోంది. మనం ఏదో ఒక గట్టి నిర్ణయానికి వచ్చి ఏదో ఒకటి చేసెయ్యాలి. నామీద నీకు అచంచలమైన విశ్వాసం వుంటే నేను చెప్పినట్లు చెయ్" అన్నాడు.

"అలాగే! తప్పకుండా చేస్తాను." అన్నది సుకేశిని.

"అయితే వెంటనే లేచి వచ్చి ఆత్రాసులో కూర్చో!" అన్నాడు ప్రతాపసింహుడు.

సుకేశిని వేరే ఆలోచనలతో కాలం వృథా చెయ్యకుండా వచ్చేసి త్రాసు సిబ్బిలో ఎక్కి కూర్చున్నది.

"మరి ఆరెండో సిబ్బిలో ఏం పెట్టుతావు?" అని అడిగింది సుకేశిని.

"నీజుట్టు! ఇప్పుడు వచిన పేచీ ఏమిటంటే-నిన్ను నిల్చోబెట్టి జుట్టుని కత్తిరిస్తే జుట్టు పెరిగిపోతోంది. నీ జుట్టుని నిలబెట్టి నిన్ను వేరుచేస్తే నువ్వు పెరిగి పోతున్నావు. కాబట్టి సరిగ్గా,నీఅంత పొడుగే నీజుట్టువున్నప్పుడూ,నీజుట్టు అంతపొడుగే నువ్వు వున్నప్పుడు గురిచూసి నీజుట్టు కత్తిరించెయ్య దలిచాను. అల్లాగనుక చేశానంటే నువ్వు పెరుగుతావు కదా అని నీజుట్టూ, నీజుట్టు

"ఒరేయ్! ప్రతి రోజూ జీడీలు కొనుక్కోటానికి నీ దగ్గర డబ్బు వుంటోందే-ఎలా సంపాదిస్తున్నావు రా?" అని అడిగాడు ఒక కుర్రాడు తన స్కూలు నేస్తాన్ని.

"ఆఁ! దానికేముందిరా? నేను యింట్లో వున్నంతసేపు మా అమ్మకు వూపిరాడకుండా ఏదో ఒక పని కల్పిస్తూ వుంటాను. అంతే!" అన్నాడు ఆ నేస్తం.

పెరుగుతుంది కదాఅని నువ్వూ తికమక పడి, యిద్దరూ పెరగకుండానే వుండిపోతారేమో చూద్దామనుకొంటున్నాను." అన్నాడు ప్రతాప సింహుడు.

"ఇద్దరమూ పెరిగిపోతే అప్పుడు ఎలాగు?"

"అసంభవం. ఏ దేవత యిచ్చే శాపానికైనా ఒక హద్దు అంటూ వుంటుంది. అదీకాక మహారాజుగారి పెద్ద తల్లిగారు త్రాసును ప్రయోగించమనటంలో యిలాటిదే ఏదో కిటుకు వుండి వుండాలి." అన్నాడు ప్రతాప సింహుడు.

సుకేశిని క్షణంకాలం ఆలోచించి "ఏది ఎల్లాగైనా మనం జాగ్రత్తపడటం మంచిది. ఒక్కసారి అంతఃపురంలోకి పోయి మాఅమ్మ నాన్నను చూసి వస్తాను" అన్నది సుకేశిని, బిక్కుబిక్కుమంటూ.

అంతః పురంలోకి పోయి అందరినీ పేరుపేరునా కలుసుకొని అందరి దగ్గరా శెలవు తీసుకొని వచ్చి భారంగా తక్కెడలో కూర్చున్నది. ప్రతాపసింహుడు ఆవిడ జుట్టునంతటినీ పోగుచేసి రెండో తక్కెడలో పెట్టాడు. జుట్టు క్షణ క్షణం పెరిగి పెరిగి చివరికి ఆ అమ్మాయి అంత బరువు తూగింది. త్రాసు ముల్లు సరిగ్గా నిటారుగా నిలబడ్డ ఆక్షణాన ప్రతాపసింహుడు ఆజుట్టు సట్టన దానికి ఒక కత్తివేటుతో తెగగొట్టేశాడు.

సుకేశిని కేశాలు ఎదగటం మానేశాయి. సుకేశిని దేహ పరిమాణంలో కూడా ఏవ్యత్యాసమూ లేకుండా అలాగే వుండిపోయింది.

శ్వేతాంక మహారాజు ప్రతాప సింహుణ్ణి గట్టిగా కౌగలించుకొన్నాడు. రాణీగారు మరికొంతమంది దాసీలు కలిసి ఆ అమ్మాయిని తక్కెడలోనుంచి దించారు.

సుకేశిని యీ భూమిమీద పడ్డ వుత్తర క్షణంనుంచీ, ఆమెనీ, ఆమె తల్లి తండ్రులనీ, ఆప్తులనీ అందరినీ యింతకాలం గాపట్టుకు వేధించిన ఆ కేశ సమస్య అంతటితో అంతరించి పోయింది!

మరునాడే మహావైభవంగా సుకేశినీ ప్రతాప సింహుల వివాహం జరిగింది. ఆ మహోత్సవానికి దిగంతాలనుంచీ వచ్చినవారంతా ఆ అమ్మాయి జుట్టుకేసి ప్రత్యేకించి చూశారు. కొందరు ఆత్మీయులు పనిగట్టుకొని ఆ అమ్మాయి జుట్టు కొలిచి చూశారు కూడాను. కొలిస్తే సరిగ్గా ఐదు అడుగుల ఐదంగుళాలు మాత్రమే వున్నది.

ఉండవలసింది కూడా అంతే! ఎంచేతనంటే-ఆ త్రాసులో సిబ్బికీ సిబ్బికీ మధ్యనుండే దూరం పది అడుగుల పది అంగుళాలు. ప్రతాప సింహుడు వేసిన కత్తివేటు సరిగ్గా మధ్యనే పడింది కాబట్టి ఆ అమ్మాయి జుట్టు ఐదడుగుల ఐదంగుళాలకంటె ఎక్కువవుండటానికి వీలులేదు. పెరుగుదల కూడా అంతటితోనే ఆగిపోయింది కాబట్టి, ఆ అమ్మాయికి ఆ బెడద తీరిపోయింది.

మనకీ యీ కథ చెప్పుకొనే శ్రమ యింతటితో ముగిసిపోయింది.

(ఆధారం: ఇ. నెస్‌బిట్ వ్రాసిన ఆంగ్లకథ అనువాదం: వి. నరసింహామూర్తి.) ★



తండ్రి మరణించాడు, ఉన్న తల్లికూడా జైలుపాలై తనను చూచే దిక్కు లేకపోయింది.
ప్రసాద్ ఆర్ట్‌పిక్చర్సువారి "పెంపుడు కొడుకు"లో కందా మోహన్.

# "తీన్ బత్తీ చార్ రస్తా"

వివిధ భారతీయ రాష్ట్రాలమధ్య, వివిధ భాషలవారి మధ్య ఏకీభావం పెంపొందాలనే సందేశంతో ప్రసిద్ధ దర్శకుడు శాంతారాం తీసిన "తీన్ బత్తీ చార్ రస్తా" మద్రాసు ప్రభాత్ టాకీసులో ప్రదర్శించబడుతోంది. సాధారణంగా గంభీరమైన కథావస్తువులే తీసుకునే శాంతారాం ఈసారి ఈ చిత్రంలో తనకు హాస్యకథా కథనంలో కూడా చాతుర్యం వున్నదని నిరూపించాడు.

ధనికుడు, ఆదర్శవాది అయిన ఒక లాలాజీ తన ఆరుగురు కొడుకుల్లో అయిదుగురికి మహారాష్ట్ర, గుజరాతీ, సింధీ, బెంగాలీ, తమిళ కన్యల నైదుగురినిచ్చి పెళ్లి చేస్తాడు. భారతీయ సంస్కృతిలోని వైవిధ్యమంతా తన ఇంట్లోనే ప్రతిబింబించాలని ఆయన ఆశయం. కాని ఈ వైవిధ్యంవల్ల ఉత్పన్నమయ్యే గందరగోళం తగ్గించి పరిస్థితులు చక్కబెట్టడం ఆయనకు అసాధ్యమవుతుంది. ఆ సమయంలో శ్యామ అనే యువతి ప్రవేశిస్తుంది. ఈమెకు బహు భాషా పరిజ్ఞానం ఉండటంచేత ఆ ఇంట్లో అందరికీ తలలో నాల్కలాగ మెలగుతూ వ్యవహారాలు సరిదిద్దుతుంది. ఇది ప్రధాన కథావస్తువైనప్పటికీ "ప్రేమ" లేందే సినిమా నడవదు గనుక శ్యామకూ లాలాజీ ఆరవ కొడుకైన రమేష్‌కు ప్రేమగాథ ప్రవేశపెట్టబడింది. శ్యామ గొప్ప గాయకురాలు. కాని అందగత్తె కాదు. ఆమె పాట రేడియోలో విని మనిషి కూడా అందంగా వుంటుందని వూహించి రమేష్ ప్రేమిస్తాడు. కాని రేడియో గాయకి, శ్యామ ఒకరేనని తెలిసి ముందు నిర్ఘాంతపోతాడు; అయినా ప్రేమ మరల్చుకోడు. రమేష్ పొందు వాంఛిస్తున్న మరొక యువతి కుట్రద్వారా శ్యామ గొంతుక పాడైపోతుంది. అయినా రమేష్ ఆమెనే ప్రేమిస్తాడు. కాని అతని తల్లి ఈ సంబంధానికి ఒప్పుకోదు. రమేష్ తాను ప్రాణాపాయంలో వున్నట్టు నటించి తల్లిని ఒప్పిస్తాడు. చివరికి శ్యామ రమేష్‌ల వివాహం జరగటానికి ముందు ఆమె కంఠం బాగుపడుతుంది.

ఈ చిత్రం తుదివరకూ ఎక్కడా విసుగెత్తించక పోవటమే గాక, కడుపుబ్బ నవ్విస్తుంది. నటీనటుల్లో శ్యామగా నటించిన సంధ్య, లాలాజీగా నటించిన దివాన్ షరర్ మంచి నైపుణ్యం చూపారు. [illegible]ంగా కురూపి అయివుండి ప్రవర్తన ద్వారా అందరి సానుభూతినీ చూరగొనవలసిన శ్యామ



రోహిణీవారి "పేదల ఆస్తి"లో సూర్యకాంతం, కె. వి. రావు, లక్ష్మయ్య చౌదరి మున్నగువారు

# ★ సినిమాలపై ఆందోళన ★

ఈరోజుల సినిమా ప్రపంచంలో ఉన్నంత ఆందోళన బహుశా రాజకీయ రంగంలో తప్ప మరెక్కడా లేదేమో. ప్రజా బాహుళ్యంతో గల సంబంధం దృష్ట్యా చూస్తే రాజకీయాల తర్వాత స్థానం సినిమాలే ఆక్రమిస్తాయి. రెంటిలోనూ అరాజకం, అవ్యవస్థ ప్రబలిపోయాయి.

సినిమాలు సంఘంలో అవినీతిని రెచ్చగొడుతున్నాయని, యువతీ యువకులను భ్రష్టులను చేస్తున్నాయని కొందరు ఆక్షేపిస్తుంటే, సినిమాలు కేవలం ప్రజల కాలక్షేపానికి ఉద్దేశించబడినవేగాని నీతులు బోధించటానికి కాదని మరికొందరు సమాధాన మిస్తున్నారు. సినిమా పరిశ్రమ పట్ల ప్రభుత్వం నిర్లక్ష్యభావం వహిస్తోందనీ, పరిశ్రమ అభివృద్ధి కాకుండా చేసే నిమిత్తం పన్నులభారం ఎక్కువ చేస్తోందనీ సినిమా పారిశ్రామికు లంటుంటే, సినిమాలు చీడపురుగులనీ, వాటికి ఏవిధంగానూ సహాయం చేయరాదనీ నైతికవాదులు, ఆదర్శవాదులు ప్రకటిస్తున్నారు.

ఉదాహరణకు ఇటీవల ఢిల్లీలో ఆదర్శ మహిళాసంఘ అని పేరుపెట్టుకున్న ఒక సంఘంవారు నేటి సినిమాలపై దుమారం లేవదీశారు. ఈ దుమారం లేవదీయటంలో కేంద్రప్రభుత్వ మంత్రులు, డిప్యూటీ స్పీకరు, పార్లమెంటుసభ్యులు, ఇంకా పలుకుబడి గల అనేకులు పెద్దలు పాల్గొని కక్ష తీర్చుకున్నారు. సినిమాలను నిందిస్తూ అనేక తీర్మానాలు చేశారు. ఈ తీర్మానాలు కేంద్రప్రభుత్వానికి సమర్పించబడతాయట.

అటు సినిమా పారిశ్రామికులను ప్రతినిధిగా భారతఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు బి. ఎన్. సర్కార్ కేంద్రప్రభుత్వం

## "తీన్ బత్తీ చార్ రస్తా"

పాత్రను సంయమనంతో నిర్వహించింది. రమేష్ గా నటించిన కరణ్ దివాన్ కామెడీకి ఆస్కారం తోడ్పడలేకపోయాడు.

ఈ చిత్రానికి కథ, సంభాషణలు దివాన్ షారర్; సంగీతం శివరాం కృష్ణ; ఫొటోగ్రఫీ బాలకృష్ణ. నటీనట బృందంలో నిరూపరాయ్, స్మృతి బిస్వాస్, లీలారమణి, శశికళ కూడా వున్నారు. ★

వారివద్దకు రాయబారం తీసుకు వెళ్ళదలచానని ప్రకటించారు.

ఈ సంఘర్షణ ఇలా ఉండగా, సినిమా పరిశ్రమలో నే పెద్ద ఆర్థికమాంద్యం వ్యాపిస్తోంది. అనేక కారణాలవల్ల సినిమాలకు రాబడి తగ్గిపోతోంది. కొత్తగా విడుదలయ్యే దాదాపు ప్రతి చిత్రమూ నష్టపడుతోంది. నిర్మాణంలో వున్న చిత్రాల సంఖ్య తగ్గిపోతోంది. నిరుద్యోగం ప్రబలింది. ఇదంతా చూసి పెట్టుబడి పెట్టగల తాహతువున్నవారు ప్రజలకేదో ఒక కొత్త ఆకర్షణ చూపి రాబడి వృద్ధిచేసుకోవాలని రంగు చిత్రాల కేసి, త్రీ డైమన్షనల్ చిత్రాలకేసి దృష్టిమరల్చుతున్నారు.

సినిమా పరిశ్రమను ప్రభుత్వం అలక్ష్యం చేస్తోందన్న మాటను ఎవరూ కాదనలేరు. పన్నుల రూపేణా పరిశ్రమను క్రుంగదీస్తున్నంతకాలమూ అది అభివృద్ధి పొందటం అసంభవం. రాజకీయ నాయకులు, మంత్రులు, తదితరులు ప్రతి ఉపన్యాసంలోనూ సినిమాలను, సినిమా పారిశ్రామికులను విమర్శించటంతో తమ బాధ్యత తీరిపోయిందని తృప్తిపడుతున్నంత వరకూ మన పరిశ్రమ పరిస్థితి ఇట్లాగే వుంటుంది. అసలు ప్రభుత్వంవారు చిత్ర నిర్మాతలను శత్రుత్వ దృక్పథంతో ఎందుకు చూడాలో అర్థం కాలేదు. సంఘంలో ఉన్న అవినీతి కంతటికీ సినిమాలే కారణమైనట్లు, తమబాధ్యత ఏమీలేనట్లు ఎందుకు మాట్లాడతారో అంతకంటే అర్థంకాదు. కనీసం ఇతరదేశాల్లో ప్రభుత్వాలు సినిమా పరిశ్రమకు చేస్తున్నంత సహాయమైనా చేయకపోగా, ఇంత పెద్ద పెట్టుబడీ, ఏటేటా పెరుగుతున్న పలుకుబడీ గల చలనచిత్రాలు నశిస్తేనే బాగుంటుందని వాంఛించటం అన్యాయంగా, ఒకవేళ ప్రస్తుత చలనచిత్రాల ధోరణి తమకు నచ్చనిపక్షంలో అందుకు తగిన చర్యలైనా తీసుకొంటే అర్థం ఉంటుంది. ఒట్టినే విమర్శించటంవల్ల చిత్రాలస్థాయి అభివృద్ధి అవుతుందనుకోవటం భ్రమ.

చలనచిత్రాల తత్వాన్ని గురించి ఇటీవల బ్రిటిష్ నిర్మాత అలెగ్జాండర్ కోర్డా ఒక్క ముక్కలో తేల్చిచెప్పాడు. లక్షలకొలదీ పెట్టుతుంటేనేగాని చిత్రం నిర్మించటం అసాధ్యం. ఈ పెట్టుబడి తనకు తిరిగిరావటమేగాక, లాభంకూడా రావాలని నిర్మాత అనుకోవటం సహజం. ఒక రచయిత ఒక పుస్తకం రాయటానికీ ఒక నిర్మాత ఒక చిత్రం నిర్మించటానికీ చాలా తేడావుంది. ఆ పుస్తకం ఇవ్వాళ కాకపోతే రేపు అమ్ముడుపోతుంది. ఈ దృష్టితోనే రచయిత పుస్తకం రాస్తాడు.



"ప్రతిజ్ఞ"లో లక్ష్మయ్యచౌదరి, జయలక్ష్మి.

కాని ఈ స్వాతంత్ర్యం చిత్రనిర్మాతకు లేదు. అతని సరుకు ఇవ్వాళే అమ్ముడుపోవాలి. ఎందుకంటే లక్షలాది పెట్టుబడి ఆచిత్రంలో ఇరుక్కుపోయి వుండటమే గాక, ఇవ్వాళ అమ్ముడు గాకపోతే రేపటికి ఆచిత్రానికి విలువఉండదు. చలనచిత్రకళకూ మిగతా కళలకూ ఉన్న తేడాయే ఇది. చలనచిత్రాలకు సంగీతానికి, కావ్యాలకూ ఉన్న శాశ్వతత్వం లేదు. పదేళ్ళకిందటి చిత్రం అప్పుడు ఎంత గొప్పదైనా ఈరోజున చూస్తే సంతృప్తికరంగావుండదు. సినిమాకళ యాంత్రికమైన టెక్నిక్ మీద ఆధారపడి ఉండటమే దీనికి కారణం.

అందుచేత సినిమాలు ఎప్పటికప్పుడు డబ్బు చేసుకోవలసిన అవసరం తప్పదు. తెలివిగల నిర్మాత ఏయే ఆకర్షణలతో చిత్రం నిర్మిస్తే ప్రజలు విరగబడి చూస్తారో ఊహించి నిర్మిస్తాడు. ఈవిధంగా నిర్మాత పెట్టుబడికి లొంగిపోయి ప్రజల్లో తక్కువ దర్జా అభిరుచులనే రెచ్చగొట్టటం జరుగుతుంది. కళపై పెట్టుబడికి అధికారం లేకుండా చేస్తేనేగాని సరియైన కళ అభివృద్ధి కాదు. ప్రస్తుత పరిస్థితుల్లో ఇది అసంభవం. ★

# ★ సినిమా వార్తలు ★

ప్రకాశ్ ప్రొడక్షన్స్‌వారి "కన్నతల్లి" గతవారం సెన్సార్ల అనుమతిపొంది విడుదలకు సిద్ధమైంది. ఈ 16 వ తేదీనే విడుదల చేయబడుతుందని తెలుస్తోంది.

* * *

## వాస్తవిక చిత్రాలు

హిందీరంగంలో "హమ్‌లోగ్" అనంతరం నిర్మాతలు వాస్తవిక కథలపై దృష్టి

(50-వ పేజీ చూడండి)

# ప్రశ్నలు..సమాధానాలు

శ్రీ కే. ముసలయ్య—జిన్నూరు, (ప. గోదావరి జిల్లా.)

విద్యార్థులు రాజకీయములలో పాల్గొనిన యెడల చెడిపోవుదురు అని పెద్దలు చెప్పుదురు. వాటిలో పాల్గొన్న యెడల కలిగెడి నష్టములేవి? పాఠశాలలో విద్యార్థులకు రాజకీయములు బోధిస్తున్నారు. అప్పుడు మాత్రం చెడిపోరా?

—రాజకీయ వ్యవహారములను గూర్చి బోధించుటవల్లగాని తెలిసికొనుటవల్లగాని విద్యార్థుల చదువుకు భంగం లేదు. యుద్ధ తంత్రములగూర్చి తెలిసికోవచ్చు, బోధించవచ్చు. కాని, విద్యార్థులు యుద్ధరంగంలోకి వెళ్ళినట్లయితే, కదన రంగంలో యుద్ధాలుచేస్తూ కాలేజీలో చదువుకొనడం సాగుతుందా? అదేవిధంగా, రాజకీయ పార్టీల వివాదాల వ్యవహారరంగం కూడా.

* * *

శ్రీ యస్. బి. నాగరాజరావు—బెంగుళూరు.

మన సామెతలలో ఒకటి "తుచ తప్పకుండా" అని యున్నది. ఈ సామెత యెట్లు పుట్టెను?

—"తుచ తప్పకుండ" అనేది సామెత కాదు. అది భాషలోని ఒక జాతీయం. సంస్కృతంలో శ్లోకాలు రచించేటప్పుడు గణములకు అక్షరాలు తక్కువైతే, కొన్ని కొన్ని మాటలకు "చ" అని చేరుస్తారు "చ" అంటే "మరియు" అని అర్థం. "తు" అని కూడా చేరుస్తారు. "తు" అంటే "కూడా" అనే అర్థం ఉంది. "అయితే" అనే అర్థం ఉంది. ఈ విధంగా సంస్కృత శ్లోకాలలోనే గాక వచనంలో కూడా "తు" అనేక సార్లు దొర్లుతూ ఉంటుంది. "చ" కూడా అనేకసార్లు కన్పిస్తూ ఉంటుంది. వాటిని విడిచిపెట్టినా అర్థభంగం కాదు. కాని, "తు చ"లు కూడా తప్పకుండా, ఉన్నది ఉన్నట్లుగా తిరిగి వ్రాయడంగాని చెప్పడం గాని సంభవిస్తే, చాలా నిర్దుష్టంగా కరెక్టుగా చెప్పినట్లు భావింపబడును. కనుక "తు చ లు" తప్పకుండా చెప్పినపని చేస్తే చాలా కరెక్టుగా చేశాడని అర్థం.

* * *

శ్రీ యస్. వి. సూర్యనారాయణ—శింగవరం (ప. గోదావరి.)

సంవత్సరాది పండుగరోజున వేపపూవు పచ్చడి తీసికొననిదే ఏదీ తినకూడదనే ఆచార మెందుకు వచ్చింది?

—సంవత్సరాది పండుగతో చైత్రమాసం ప్రవేశిస్తుంది. చైత్రమాసంతో వసంతఋతువు ప్రవేశిస్తుంది. వసంత ఋతువులో చెట్లు చిగిరిస్తాయి, పుష్పిస్తాయి, పిందెలు వేస్తాయి. మన రక్తమును శుద్ధిచేసేదిన్నీ, జీర్ణకోశమును పైత్యకోశమును బాగుచేసి మంచి స్థితిలోకి తెచ్చేదిన్నీ ఏదంటే, సులభంగా అందరకూ లభించేటటువంటి తాజా పదార్థం ఏదంటే, చేదు రుచిగల వేపపూవు. ఈ వేపపూవును పోగుచేసి ఎండబెట్టి నిల్వచేసి తిరిగి సంవత్సరాది వచ్చేవరకు దాచుకొని, జీర్ణకోశము చెడకుండా, రక్తశుద్ధికొరకై అప్పుడప్పుడు వేపపూవు పచ్చడిగా చేసి తింటూ ఉండాలి. ఇది ఆయుర్వేద సిద్ధాంతం. సర్వ శరీర ధాతువులకు నూతనోద్దీపనము నివ్వగలిగిన సర్వజన సులభమైన పదార్థమును, ఈ క్రొత్త సంవత్సరారంభముతో ఉత్పత్తియైన పదార్థమును స్వీకరించి అటుపిమ్మట యింకేదైనా తినవలెనని పెద్దలు చేసిన నిర్ణయంలో పెద్ద ప్రయోజనం పరమార్థం ఉంది.

* * *

శ్రీ యస్. శాంత—పేటేరు, (గుంటూరు జిల్లా).

ప్రతి సంవత్సరము జనవరి 14 తారీఖుననే సంక్రాంతిపండుగ వస్తుంది. సంక్రాంతి పండుగ హిందువుల పండుగగదా జనవరి 14 వ తేదీన వచ్చుటకు కారణమేమి?

—మకరరాశిలోకి సూర్యుడు ప్రవేశించినప్పుడు మకర సంక్రమణం అంటారు. అదే సంక్రాంతి పండుగ. రాసులు 12 కలవు. సూర్యుడు 12 రాసులలో వరుస క్రమంగా ప్రవేశించి తన సంచారం ముగిస్తాడు. అప్పుడు ఒక సంవత్సరకాలం పూర్తి అవుతుంది. ఈ లెక్క ప్రకారంగా ఒక సంవత్సరకాలమును గుణించారు. సూర్యుని రాసుల లెక్క ప్రకారం గుణించిన సంవత్సర ప్రమాణమును సౌర సంవత్సరం లేదా సౌరమాన సంవత్సరం అన్నారు. ఇంగ్లీషువారి క్యాలెండరు సౌరమానం ప్రకారంగా తయారుచేసి స్థిరపరిచినటువంటిదై యున్నది. మకరరాశిలోకి సూర్యుడు ప్రవేశించే తేదీని స్థిరంగా ఉండేటట్లు నిర్ణయించారు. అదే విధంగా



ఏప్రిల్ 15 వ తేదిన వినోదా పిక్చర్సు డిస్ట్రిబ్యూషన్ ఆఫీసు విజయవాడలో ప్రారంభించబడింది. శ్రీ కె. వి. రెడ్డి (వాహినీ పిక్చర్సు), శ్రీ డి. యల్. నారాయణ (వినోదా పిక్చర్సు భాగస్వామి), డి. వి. నరసరాజు గారలను చిత్రంలో చూడవచ్చు.

'సాంఘిక చిత్రంలో ప్రేమ ఘట్టం షూటింగ్ జరుగుతోంది. నాయకి పట్ల ప్రేమ నటించటానికి నాయక పాత్రధారి అనేకసార్లు ప్రయత్నించాడు కానీ, అది డైరెక్టరుకు సంతృప్తికరంగా తోచలేదు. డైరెక్టరుగారు విసుక్కోవటం ఆరంభించాడు.

అంతవరకూ దూరంగా కుర్చీలో కూర్చొని లేక తంటాలు పడుతున్న ప్రొడ్యూసరు లేచి, డైరెక్టరు దగ్గరికి వచ్చి "ఇక లాభం లేదండీ! మన హీరో ఆమెతో ప్రేమ నటించలేదు. వచ్చిన తిప్పలేమంటే-యీహీరోగారు యిదివరకటినుంచీ ఆమెను ప్రేమించేస్తున్నాడు" అన్నాడు.

మేషరాశిలో సూర్యుడు ప్రవేశించే యింగ్లీషు తేదీకూడా స్థిరంగా ఉండేటట్లుగా వారి క్యాలండరు తయారుచేశారు. 12 రాసులలోను సూర్యుడు ప్రవేశించే టటువంటి తేదీలు ఇంగ్లీషు క్యాలెండరు ప్రకారంగా స్థిరమైన తేదీలుగా నిర్ణయింపబడినవి. మకర సంక్రాంతి, మీన సంక్రాంతి, మేష సంక్రాంతి, వృషభం సింహం, కన్యవగైరా సంక్రాంతులన్నీ కూడాఇంగ్లీషు క్యాలెండరులో ప్రతిసంవత్సరమూ స్థిరమైన తేదీలలో ఉంటాయి. ఒక్క మకర సంక్రాంతి మాత్రమే కాదు అవిధంగా కన్పించేది.

* * *

శ్రీ బి. రామిరెడ్డి—వాల్తేరు.

ప్రొద్దుగ్రుంకిన పిమ్మట పచ్చని చెట్టుగాద చేయి వేయరాదంటారు? ఎందుచేత? చెట్లుకూడా నిద్రపోతాయా?

—అవును. జీవకారుణ్య తత్వము ననుసరించి చెట్లకుకూడా హింస కలుగచేయరాదనే భావం మనవాళ్ళకు చాలా కాలం నుంచీ ఉంది.

* * *

శ్రీ భాగవతుల శ్రీరామశాస్త్రి—తెనాలి.

రాజగోపాలాచార్యులవారు రాజీనామా యిస్తారని ఒక పత్రికలో వ్రాశారు. ఇది ఎంతవరకు నిజము?

—తన ముఖ్యమంత్రి పదవికి రాజీనామా దాఖలు చేస్తానని "రాజాజీ" అన్నమాట కాదు. కాని "రాజీ" నామా అనేది "రాజాజీ" అన్న మాటలోనే ఉన్నదని ఏ పత్రిక అయినా వాదించవచ్చు.

ప్రజాసేవ దేశసేవ, మాతృసేవ యీ మూడింటిలో ఏది మంచిది? ఏది గొప్పది?

—భారతంలో యిటువంటిదే యక్ష ప్రశ్నలలో ఒకటి ఉంది. స్వర్గంకంటె గొప్పది ఏది? ఆ ప్రశ్నకు "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అని యక్షునకు ధర్మరాజు జవాబు చెప్పెను. స్వర్గంకంటెను గొప్పది తన తల్లి, తన జన్మభూమి అన్నాడు. ఇంట గెల్చి రచ్చ గెలవాలి అన్నారు. సర్వసాధారణ పరిస్థితులలో ఇంట్లో మున్ముందుగా ముఖ్యంగా తన తల్లికి చేయవలసిన ఉపచారాలు చేయాలి. అటు పిమ్మట తన యిరుగుపొరుగు ప్రజలకు ఏదైనా చేతనైన సేవాసహాయం చేయాలి. ఈ రెండూ చెస్తే దేశసేవ చేసినట్లే.

* * *

శ్రీ రేమెల్ల వేంకటరమణమూర్తి ఖైరాబాద్ (హైద్రాబాదు)

భారతదేశంలోని ప్రస్తుతపు రాష్ట్ర ప్రభుత్వముల పరిపాలనలలో అన్నింటికన్న ఏ రాష్ట్ర ప్రభుత్వ పరిపాలన బాగున్నది?

—రాజకీయపార్టీల తగాదాలలో ఒక రాష్ట్రాన్ని మించి ఇంకొకటి ఉంది. కాని మంచిరాష్ట్రం "సురాష్ట్రం" అని చెప్పబడేది ఏదైనా ఉన్నదా అని చూస్తే "సౌరాష్ట్రం" ఒక్కటే కన్పిస్తుంది.

* * *

డి. ఆర్. సుబ్బారావు—వినుకొండ.

తెలుగు పిక్చర్సు అన్నీ సాధారణముగా మద్రాసులోనే తీస్తారు. కాని మద్రాసులో విడుదల చేయకపోవటానికి గల కారణమేమి?

—తెలుగు చిత్రాలు తెలుగుదేశంలోనే నష్టపోతుంటే ఇక మద్రాసులో ఏం విజయం పొందుతాయని సందేహంవల్ల కావచ్చు.

సినీఫీల్డులో చేరినవారు చెడిపోవుదురని కొందరంటారు అది నిజమా అబద్ధమా?

—చెడిపోయినవారూ వున్నారు బాగుపడినవారూ వున్నారు.

సినిమా నటులు నటించడం డబ్బు సంపాదించుట కొరకా? లేక పేరు సంపాదించుట కొరకా?

—రెండూ రైటే. అందులో తప్పేముంది?

* * *

పట్నాల సన్యాసిరావు—గుణుపురం.

"సెక్సప్పీల్" దృశ్యాలు లేని ఇప్పటి తెలుగు చిత్రాలేవైనా ఉన్నవా?

—హిందిచిత్రాలతో, తమిళచిత్రాలతో పోల్చి చూస్తే సెక్స్ అపీల్ తెలుగు చిత్రాల్లో బొత్తిగా తక్కువనే చెప్పాలి. ఈ అపిల్ దాదాపు లేని చిత్రాలు బెంగాలీ చిత్రాలే. సెక్స్‌ను ఏ కళలోనింనైనా పూర్తిగా తొలగించటం సాధ్యం కాదు. అయితే సెక్స్‌లోకూడా ఉత్తమ నీచ భేదాలున్నాయి. ఉత్తమ కళాకారుడు సెక్స్ చిత్రించేటప్పుడు కూడా సెక్స్‌కు అతీతుడైవుంటాడు.



భానుమతి డైరెక్టు చేస్తున్న "చండీరాణి"లో పుత్రోదయాన్నికై ఎదురుచూస్తున్న మహారాజు (అమర్ నాథ్)

# సినిమా వార్తలు

(47-వ పేజీ తరువాయి)

మరల్చివేస్తూ పోతుంది. ఇటాలియన్ చిత్రం "బైసికిల్ థీఫ్" కూడా దీనికి తోడ్పడిన ట్లున్నది. రాజ్ కపూర్ "బూట్ పాలిష్" అనే చిత్రం తీయనున్నాడు. కలకత్తాలో ప్రేమేంద్ర మిత్ర అనే ఆయన "వేస్ట్ పేపర్" అనే చిత్రం, నిర్మల్ ఘోష్ అనే ఆయన "ఛిన్నమూల్" అనే చిత్రం తీస్తున్నారు. ఈ చిత్రాలన్నీ సంఘంలో అట్టడుగున పడి పోయిన అభాగ్యుల జీవిత విధానాన్ని చూపిస్తాయి.

* * *

న్యూ థియేటర్సువారు "నద్-నదీ" అనే చిత్రం తీస్తున్నారు. "బింధూర్ చేలి" చిత్రం తీసిన చిత్తబోస్ ఈ కొత్తచిత్రం డైరెక్టు చేస్తున్నారు. "యాత్రిక్" రచయిత ప్రబోధ్ కుమార్ సన్యాల్ కథ రాశాడు. భారతీదేవి ఈచిత్రంలో నాయిక పాత్ర ధరిస్తోంది.

"మా" చిత్రం డైరెక్టుచేసిన బిమల్ రాయ్ "దో బీఘా జమీన్" అనే కొత్త చిత్రం తీస్తున్నారు. ఇది మే నెలాఖరుకు పూర్తికావచ్చు. నిరూపరాయ్, బల్రాజ్ సహానీ, మురాద్ మున్నగువారు నటిస్తున్నారు. ఇటీవల పుడ్వికిన్ అనే సోవియెట్ ప్రతినిధి ఒకాయన ఈ చిత్రం చాలాకు రషెస్ చూసి తనుచూసిన భారతీయ చిత్రాల్లోకల్లా ఇదే ఉత్తమంగా ఉందన్నాడట.

* * *

[illegible]

వి. శాంతారాం "సురంగ్" అనే కొత్త చిత్రం తీస్తున్నారు.

కథ రచించిన వినోద్ ప్రధాన పాత్ర ధరిస్తాడట. ఉల్హాస్, శశికళ, శీలారమణి, చంద్రకాంత్ మున్నగువారు ఇతర నటీనటులు.

"కల్పన" చిత్రంతీసి ఇండియాలోను, ఇతర దేశాల్లోను సినిమా నిర్మాతగా కూడా ఖ్యాతిపొందిన నాట్యకోవిదుడు ఉదయ శంకర్ తన బృందంతో సహా మే నెల 17 న మద్రాసు, న్యూ ఎల్ఫిన్‌స్టన్‌లో నాట్యప్రదర్శనం ఇస్తున్నారు.

* * *

రాజ్ కపూర్ పూర్వం తీసిన "ఆవారా" చిత్రం ఈ ఏడాది కాన్స్ చలన చిత్రోత్సవంలో ప్రదర్శనకై పంపించబడుతోంది.

* * *

నిర్మాణంలోని చిత్రాలసంఖ్య తగ్గుతున్నందున మద్రాసులోని స్టూడియోలవారు ఫ్లోరు అద్దెలు తగ్గిస్తున్నారని తెలుస్తోంది. వాహినీ స్టూడియోలో అద్దె 750-0-0 కు తగ్గించబడిందట.



భానుమతి డైరెక్టు చేస్తున్న “చండీరాణి”లో పుత్రోదయానికై ఎదురుచూస్తున్న మహారాజు (అమర్ నాథ్)

# సినిమా వార్తలు

(47-వ పేజీ తరువాయి)

మరల్పిస్తు తోస్తుంది. ఇటాలియన్ చిత్రం “బైసికిల్ థీఫ్” కూడా దీనికి తోడ్పడినట్లున్నది. రాజ్ కపూర్ “బూట్ పాలిష్” అనే చిత్రం తీయనున్నాడు. కలకత్తాలో ప్రేమేంద్ర మిత్ర అనే ఆయన “వేస్ట్ పేపర్” అనే చిత్రం, నిర్మల్ ఘోష్ అనే ఆయన “[illegible]” అనే చిత్రం తీస్తున్నారు. ఈ చిత్రాలన్నీ సంఘంలో అట్టడుగున పడిపోయిన అభాగ్యుల జీవిత విధానాన్ని చూపిస్తాయి.

* * *

న్యూ థియేటర్సువారు “నవ్-వధూ” అనే చిత్రం తీస్తున్నారు. “బిందూర్ చేలే” చిత్రం తీసిన చిత్రబోస్ ఈ కొత్తచిత్రం డైరెక్టు చేస్తున్నాడు. “యాత్రిక్” రచయిత ప్రబోధ్ కుమార్ సన్యాల్ కథ రాశాడు. భారతీదేవి ఈచిత్రంలో నాయిక పాత్ర ధరిస్తోంది.

“మా” చిత్రం డైరెక్టుచేసిన బిమల్ రాయ్ “దో బీఘా జమీన్” అనే కొత్త చిత్రం తీస్తున్నాడు. ఇది మే నెలాఖరుకు పూర్తికావచ్చు. నిరూపరాయ్, బల్రాజ్ సహానీ, మురాద్ మున్నగువారు నటిస్తున్నారు. ఇటీవల పుడ్వ్యాకిన్ అనే సోవియెట్ ప్రతినిధి ఒకాయన ఈ చిత్రం తాలూకు రషెస్ చూసి తను చూసిన భారతీయ చిత్రాల్లోకెల్లా ఇదే ఉత్తమంగా ఉందన్నాడట.

* * *

[illegible]

వి. శాంతారాం “సురంగ్” అనే కొత్త చిత్రం తీస్తున్నాడు.

కథ రచించిన వినోద్ ప్రధాన పాత్ర ధరిస్తాడట. ఉల్హాస్, శశికళ, శీలారమణి, చంద్రకాంత్ మున్నగువారు తదితర నటీనటులు.

“కల్పన” చిత్రంతీసి ఇండియాలోను, ఇతరదేశాల్లోను సినిమా నిర్మాతగా కూడా ఖ్యాతిపొందిన నాట్యకారుడు ఉదయశంకర్ తన బృందంతో సహా ఈనెల 17 వ మద్రాసు, న్యూగ్లోబ్‌లో నాట్యప్రదర్శనం ఇస్తున్నాడు.

* * *

రాజ్ కపూర్ పూర్వం తీసిన “ఆవారా” చిత్రం ఈ ఏడాది కాన్స్ చలన చిత్రోత్సవంలో ప్రదర్శనకై పంపించబడుతోంది.

* * *

నిర్మాణంలోని చిత్రాలసంఖ్య తగ్గుతున్నందున మద్రాసులోని స్టూడియోలవారు ఫ్లోరు అద్దెలు తగ్గిస్తున్నారని తెలుస్తోంది. వాహినీ స్టూడియోలో అద్దె 750-0-0 కు తగ్గించబడిందట.

# ★ పోస్టు జవాను ★

(35-వ పేజీ తరువాయి)

హారి: చాల్లే తెలివితేటలు, నీవు ఆ పరికిణీ యిప్పేసి నా లాగు తొడుక్కో. ఇంకా బాగుంటావు కోతిమొఖం; నువ్వూనూ.

యశో: ఓ! నా పరికిణీ నువ్వు కట్టుకుంటావా మరి? నేను నీలాగూ తొడుక్కుంటాను.

లక్ష్మి: ఇదిగో; ఆటలు మాని యిలా దెబ్బలాడుకోటంలోకి దిగేరేమిరా?-అయితే నే నింటికి పోతాను.

హారి: మరిలేకపోతే, యశోద చూడు జానెడు లేదూ - ఎలా మాట్లాడుతోందో!

(అంతవరకు వాళ్ళ పోట్లాట వింటూ వున్న పోస్టుజవాను వచ్చిన పని మర్చిపోయి, గుమ్మానికి ఆనుకుని నిలబడి నవ్వుతూవుంటాడు).

యశో: ఏయ్; ఎందుకబ్బాయి అలా పళ్లికిలించుకొని నవ్వుతావు?

హారి: మీ యింట్లో మటుకు పిల్లలిలా దెబ్బలాడుకోరా?

లక్ష్మి: పాడు కాకీ గుడ్డలూ, నువ్వూనూ! అలా నిలబడి చూడకపోతే, పోయి ఆ మూల కూర్చోరాదూ?

సోము: లక్ష్మి! ఎందుకే అలా ఆ అబ్బాయిమీద పోట్లాడతావు? ఏమండీ కాకీ చొక్కాల ఆఫీసరుగారూ; కూర్చోండి! ఆ. నువ్వు చెప్పు యిందులో ఎవరిది తప్పో!

హారి: చాల్లే! దొరికాడు పెద్ద మధ్యవర్తి. యేంటే! మేం దెబ్బలాడుకున్నదీ లేనిదీ ఈయన అసలు చూశాడ!

పోస్టు: బాగా అన్నావు చిట్టిబాబూ! పిల్లలు మీరు ఎంతో మంచివాళ్లు! అంతట్లో పోట్లాడుకొంటారు-మళ్లీ ఎవరూ రాకుండానే. కలుస్తూవుంటారు, మీ అంతట మీరే! పిల్లల పోట్లాటలు ఎంతోసేపు నిలవవు నాయనా!

యశో: నే నసలు ఈ హారిగాడితో మాట్లాడనే మాట్లాడను!

హారి: మళ్ళీ ఏమొచ్చిందే యశోదా! పోనీలే నేను గాజులు వేసుకుంటే మీ నాయనమ్మ కోప్పడదూ. అయినా-వాళ్లనాయనమ్మ లక్ష్మికి యిచ్చింది. ఎంతో ప్రేమతో పట్నంనుంచి తెచ్చింది గదా, మరి నాకిస్తే దెబ్బలాడదూ!

సోము: అవును, ఒకవేళ వాళ్ల అమ్మావాళ్లు, లక్ష్మియింటి కెళ్లాక, 'గాజులేవే' అంటే, 'వాళ్లబ్బాయి హారికి యిచ్చాన' టే పట్టుకు కొట్టరూ, లక్ష్మిని?

పోస్టు: నిజం, వీపు పగిలేటట్లు కొడతారు! అయినా లక్ష్మి బుద్ధిమంతురాలు. మగపిల్లలు గాజులేసుకోరు కదమ్మా?

యశో: అదిగో మళ్లీ తగాదా పెడుతున్నావు? నువ్వు మీ యింటికి పో!

లక్ష్మి: తప్పు! ఆయనను అలా అనకూడదు! మనకంటే పెద్దవాళ్లని గౌరవంగా చూడాలే యశోదా!

హారి: ఇదిగో అబ్బాయి; నువ్వేమీ అనుకోకు!- యశోద చిన్న పిల్లలే.

యశో: చాల్లే చెప్పొచ్చారు! నే నసలు యివాళనుంచి మీ జత వుండనే వుండను.

సోము: నిజం. యశోద మీ సావాసం వుండనే వుండదు. కదే యశోదా? అయితే బళ్లో లెక్కలు ఎవరు చేసిపెట్తారో చూద్దాం!

హారి: అబ్బే అట్లా నవ్వుతాలకి అంటుందిరా! యశోదా; నువ్వు యివ్వాళ యింటిలెక్కలు చెయ్యలేదల్లేవుంది; పంతులుగారు కొట్టరూ?

సోము: పదండి; ఆటలు ఆపేసి లెక్కలు చేసుకుందాం.

లక్ష్మి: ఎదవ లెక్కలు, ఏం చేయకపోతే? రారా, హారీ; మనం ఆడుకుందాం!

యశో: నే నాడను.

సోము: పోనీ మనం లెక్కలు చేసుకుందాం.

పోస్టు: సరిపోయింది! మళ్లీ

---

జంతువుల పట్ల దయ చూపటాన్ని గురించి క్లాసు మేష్టరు అరగంట సేపు వుపన్యాసమిచ్చాక, ఒక కుర్రాణ్ణి పిలిచి 'నీవెప్పుడైనా ఏ జంతువునైనా దయగా చూశావా?' అని అడిగాడు.

"ఆ! మాతమ్ముడు కుక్కని పట్టుకు తన్నుతుంటే, వాడిని పట్టుకొని నేను తన్నేనండీ" అని ఆకుర్రాడు సమాధానం చెప్పాడు.

కొట్లాడటానికి సిద్ధమయ్యారు. తప్పు పాపా! నలుగురూపోయిన దారిలో మనమూ వెళ్లాలి. నీవు అలా పెంకి పట్టుపట్టి వాళ్ల జట్టులోంచి విడిపోతే అనక లెక్కలు చెయ్యలేదని పంతులుగారు తంతారు. ఇంకా ఎన్నో కష్టాలు వస్తాయి. నలుగురూ కలిసివున్నప్పుడే మనకి చాతకానిది అవలీలగా— ఇతరుల సహాయంవల్ల చెయ్యవచ్చు.- నువ్వు ఒక్కదానివీ విడిపోయావంటే, నిన్ను అంతా చులకనగా చూస్తారు. చిన్నపిల్లలు, అల్లా పెంకిపట్టు పట్టగూడదమ్మా! చూడు; నువ్వు వాళ్లజట్టులోవుంటే నిన్ను ఎవ్వరూ ఏమీ చెయ్యరు.

లక్ష్మి: బాగా చెప్పారండి మీరు! మాఅన్నయ్యకూడా సరిగ్గా యిలాగే అంటుంటాడు. మా యశోద, చిన్నది. అన్నింటికీ అది యిలాగే తగాదా లాడ్తుంటుంది. మా నాన్న దాన్ని ఎప్పుడూ కేక లేస్తునే వుంటారు. అయినా దానికి బుద్ధిరాదు.

హరి: అట్లా అనకు లక్ష్మి! ఇప్పటికే దానికి మనమీద చాల కోపంగా వుంది. మీ అమ్మతో చెప్పి మనలను కొట్టించినా కొట్టించగలదు.

సోము: అబ్బే; యశోద చాలా మంచిది! మీరంతా కలిసి దాన్ని వుడికించటంవల్లనే దానికి కోపం పెరిగి, ఆకోపం పట్టలేక రోషంగా మారి, ఆ పగ సాధించుకుంటుంది.

పోస్టు: బాగాచెప్పావు బాబు! మనలో చాలమందికి బలహీనత వల్ల, ఎదటివారిని ఎదరించేశక్తిలేక, కోపం ఎక్కువై,ఆ కోపం తీర్చుకోలేక రోషంగా మారి పరాభవం పొందుతూ వుంటాం. ఈ జబ్బు పిల్లలలోనే కాదు, పెద్దల్లో కూడా వుంది.

యశో: నేను వెళ్లిపోతున్నా. నువ్వు వస్తావా లక్ష్మి?

హరి: యశోదా చెప్పూంట నీకే గదా; వెళ్లావంటే నీ సావానంపచ్చి.

సోము: కోపం వచ్చిందా యశోదా? చూడు; నిన్ను ఎవ్వరూ ఏమీ అనరు. నేనున్నానుగా మాతల్లివి గదూ, రా! [హరి, సోము,లక్ష్మి, యశోదను బలవంతంచేసి బుజ్జగించి, అరుగుమీదకు తీసుకువచ్చి కూర్చోపెడ్తారు.]

పోస్టు: ఏమయినా అన్నానని కోపం వచ్చిందా యశోదమ్మా! ఇటుచూడు, నీమీద నాకు ఏం కోపంలేదు. నీవు యింకా చిన్నపిల్లవు. తప్పమ్మా అలా పోట్లాడ గూడదు.

[యశోదకు వచ్చిన రోషం ఎక్కువై, కంటినుండి రెండుబొట్లు లార్తాయి. పోస్టుజవాను ఎంతో బాధపడ్తాడు. భుజానవున్న సంచి పక్కనపెట్టేసి యశోదను ఒళ్ళోకి తీసుకుంటాడు. చుట్టూ పిల్లలు మూగుతారు. హరి, సోము, గాబరాగా పోయి యశోదకి చెరొక పక్క కూర్చుంటారు. ఇంతట్లోకి కామేశ్వరరావుగారు ప్రవేశిస్తారు. వయస్సు 40 సంవత్సరాలు, కళ్ళద్దాలు, చేతిలో కఱ్ఱ సందర్భం అర్థంకాక-'ఏమిటిరాఅది' అంటూ వస్తాడు].

లక్ష్మి: ఏమిలేదండి; బాబాయిగారూ, యశోద ఆటలో దెబ్బతిని ఏడుస్తూందండి.

సోము: అదికాదు నాన్నా ... (చెప్పొద్దని లక్ష్మి కనుసైగచేస్తుంది)

కామే: ఏమయిందిరా; ఏమిటి జరిగింది?

పోస్టు: (లేచి నిలబడి జరిగిందంతా చెప్పి) ఏం లేదు పంతులుగారూ—పసిపిల్లలు వారి మనస్తత్వాలు అర్థమవటం కష్టం. చిన్నతనంలోనే వారిలో చెడుభావాలు లేకుండా మంచి నడవడి అలవాటు చేస్తే, వారంతా పెద్దవారయ్యాక

# ★ పోస్టు జవాను ★

దేశానికి ఎంతైనా వుపయోగ పడ గలరు!

కామే: నిజం! పిల్లల జీవితాలకి, వారి నడవడికీ పెద్దల 'ప్రవర్తన' పెంపుడే కారణం! అన్నట్లు నీవు వచ్చి ఎంతసేపయింది? వుత్తరాలు ఏమయినా వచ్చాయా!

పోస్టు: క్షమించాలి: పిల్లల ఆట ల్లోపడి నేను మిగిలిన సంగతులే మర్చిపోయాను. తమకి వో కవరు వచ్చింది. [కవరుతీసి యిచ్చి]— ఏమిటో బాబయ్యా! పిల్లలనుచూస్తే నా కేమిటో తగనిప్రేమ. వాళ్లను చూస్తే నా సర్వస్వం మర్చిపోయి వాళ్ల ఆటల్లో పడి, వారితో కలిసి పోదామనిపిస్తుంది బాబుగారూ. [కంఠంలో గాద్గదికం తోస్తుంది]

కామే: (వుత్తరాన్ని అందు కుంటు) నిజం. నువ్వు చెప్పినట్లు పిల్లలు భగవత్ స్వరూపులు, పిల్లలు గల యిల్లు స్వర్గలోకం కాదా! నీ కెంతమంది పిల్లలు ?

పోస్టు [కన్నీరు కారుస్తూ] నాకు ఆ భాగ్యం లేదు పంతులుగారూ! నే నొకనిర్భాగ్యుణ్ణి. ఆ రేళ్లు పెరిగిన పండంటి కుర్రాడిని మృత్యుదేవత లాక్కుపోయింది. వాడిమీది మమ కారం వదులుకోలేక మా యింటిది కూడ ఆతరువాత కొన్నాళ్లకి వెళ్లి పోయింది ఆలోకానికి. పాపిష్ఠిని-నేను మాత్రం యీ బ్రతుకు బరువుని మీద వేసుకు లాగుతూనే వున్నాను. [కంట తడిపెట్టతాడు.]

కామే: [విచారిస్తూ] అధైర్య పడి అలా కుంగిపోతే నిండుజీవితం నాశనమైపోతుంది. చూడు; నీకు యింకా ముప్పయియేళ్లు అయినా నిండలేదల్లేవుంది, తిరిగి వివాహం చేసుకోలేదా !

పోస్టు: లేదు బాబయ్యా! ఇక నాకా యోగంలేదులే బాబయ్యా. ఏదో మా ముసిలితల్లికోసం యిలా యింటింటికీ తిరిగి యీ వుద్యోగం చెయ్యవలసివచ్చింది!..వస్తా బాబూ! యిప్పటికే పన్నెండు అయింది. శెలవు!—

కామే: వెళ్లిరా పాపం! మంచి వాడు. [పోస్టుజవాను వెళ్లిపోతాడు]

ఇక పదండిరా, లోపలకి-అన్నాలు తిందురుగాని!

లక్ష్మి: మేం పోతాంరా హరీ. సాయంత్రం మాయింటికి రండి; ఆడుకుందాం.

హరి :యశోదా! కోపం పోయిం దా?-లేకపోతే రాము.

యశో: [నవ్వుకుంటూ] చాల్లే. అన్నింటికి నువ్వే మొదలు.

లక్ష్మి: ఇక పోతాం-బై. బై. [అంటూ లక్ష్మి, యశోదా వాళ్లింటికి వెళ్ళిపోతారు. హరి, సోము తండ్రితో కలిసి లోపలికి వెళ్తారు.]

[తెర పడుతుంది]

★

# ★ అనుమాన పిశాచం ★

(34-వ పేజీ తరువాయి)

ఆపద రాబోతుందో?...కాని ఒక్క విషయం. ఇప్పుడెంతమంది భోజనం చేసి నిద్రపోవటంలేదు? అందరికీ ఏమైనా అవుతోందా ఏమిటి?... కాని వారంతా కడుపుకక్కుర్తి కోసరం గాదుగా తినేది. ఎక సక్కెంగా, అతి ఎక్కువగా రాత్రి భోజనంగూడా దాంతోనే చేశా డాయె తాను. నాన్నా అంతేగా...? ఎక్కువగా తిన్న వాళ్లకే గామాలు యిలా జరగేది?

ఈ భయంతో రాత్రంతా నిద్ర పోలేదు సుబ్బయ్య. రాత్రల్లా యివే ఆలోచనలు. దానికితోడు కొద్దిగా కునికితే వెర్రికలలు. వెంకయ్యన్న మాటలే చెవుల్లో మ్రోగాయి ఎన్ని సార్లో.

మొత్తం మీద ఎలాగో తెల్ల వారింది. కాని సుబ్బయ్య లేచే పరి స్థితిలో లేడు. ఒళ్లంతా హూనమై ఉంది బాగా జ్వరం వచ్చింది. వెంకయ్య అన్న మాటలే వాగు తున్నాడప్పుడప్పుడు.

సాయంత్రం అయింది. మిత్రుడు పొలానికి రాకపోయేప్పటి కాశ్చర్యంతోచి, వెంకయ్య వీరయ్యలు యితన్ని చూడడానికి చక్కా వచ్చారు.

ఆశ్చర్యపోయా రీ మార్పుకి. అంత ఎక్కువ జ్వరం రావటానికి గల కారణం వారికేం తెలియలేదు.

అప్పటికే సుబ్బయ్యకి పలవరిం తలు కూడా ఎక్కువ అయ్యాయి. "నాన్నా - నేను వస్తున్నాను నాన్నా" అంటున్నాడు. ఇంటిల్లి పాదీ హడలిపోతున్నారు.

వైద్యుడు తగురీతి శ్రద్ధ చూపిం

# అదృష్టశాస్త్రమూ - నీతిశాస్త్రమూ

(19-వ పేజీ తరువాయి)

కాని "స్వామి" రాలేదు. సుభద్ర సీతకు, సావిత్రికి, ద్రౌపదికి వారసురాలు - గనక పెదిమలు విప్పలేదు.

గడియారమూ, కాలమూ ఆగిపోయినాయి. వెలాతెలా పోతున్న నక్షత్రాలు ప్రపంచంలోని విషాదాన్నంతా తాగి కాంతిని పోగొట్టుకొన్నట్టు తోపింపజేస్తున్నై. కామేశ్వరరావు తూలుతూ నడుస్తున్నాడు. బహుశః తన శిరస్సే లేక పాదాలో మేఘాల్లో వుండి వుండాలి. అంతే గాదు. ఈలపాటగూడా పాడుతున్నాడు. వచ్చి గది తలుపును ఒక్క తన్ను తన్నాడు. పిల్లవాడు కెవ్వన కేక వేసి మూర్ఛపోయాడు. హైందవ స్త్రీ, లోకంలోని అన్ని సుగుణాలకు, నీతిశాస్త్రాలకు ధర్మకర్త్రి అయిన సుభద్ర మొగాళ్ళ మీద మ్రొక్కింది.

గతపదినిమిషాలసేపు లయనృత్యం చేసింది. ఉత్తరమూ, దక్షిణమూ తమ దిక్కుల్ని పరస్పరంగా మార్చుకొన్నాయి. స్థావరాలన్నీ కొన్ని క్షణాలసేపు జంగమమైన ప్రాణులయినాయి. భారతపత్ని తన కేశాలను తిరిగి ముడివేసుకొన్నది.

"మధ్యాహ్నం పంపించిన కాయితం ఏదే...ముండా..." గదంతా బ్రాందీకంపు కొట్టి, పిల్లవాడిగ్గూడా తెలివొచ్చింది.

అపరలయకారుడు కాయితాన్నందుకొని వందతుంపులు చేశాడు. భస్మాసురుడై చేతులు బ్రహ్మాండంవైపు చాచి (అతనేమంత ఆజానుబాహు కాడు -) అరిచాడు:

"జీవితంలో నేను అపజయాన్ని ఒప్పుకోను !... ముమ్మాటికీ... ఉహూఁ ......"

భారతదేశంలోని అన్ని వస్తువుల్లోనూ చౌకవస్తువైన భార్యముందు, తనవంటి ధీరుడు అపజయాలు ఒప్పుకోవలసిన అవసరం ఏముంది గనక - మీనన్ యిప్పించిన డోసు అంత చక్కగా, ఘాటుగా పని జేస్తుంటే...? ఓటమి ఎక్కడవుందోగూడా తెలియకుండా, తనచే భరించబడుతున్న ద్విపాదపశువు కాళ్ళు పడుతుంటే - వీరపురుషుడు మగతనిద్రపోయాడు - అరడజను వాంతులు అయినాక.

* * *

ప్రొద్దున్నే మసకచీకట్లోనే నిద్ర మెళకువ వచ్చింది. కాళ్ళ కట్టిన ఎకనామిక్సు తెలీని సుభద్ర తన పాదాలకు తల ఆనించి రాత్రి చెడ్డకలలనూ, ఆకలినీ నెమరు వేసుకొంటున్నది. పిల్లవాడి డొక్కలుగూడా కనిపించినై - ఎక్కడో చాలా లోతుగా. తన తల యింకా దిమ్ముగానే వుంది - అది అపజయాలు ఒప్పుకోని మానవుడి తలే. ఎకనామిక్సు తెలిసిన ఘనుడితలే.

వారఫలితాలు చదువుకుంటూ కథానాయకుడు ఆఫీసుకు వెళ్లాడు. అక్కడ గుర్రాల పుస్తకం తప్పితే రికార్డులు ముట్టుకోలేదు. రోజా పులిలాగా అరిచే తోటేలు నూపరింటెండెంటుగూడా విస్తుపోయి చూస్తూ వూరుకొన్నాడు. తన ప్రక్కనే మీనన్ రికార్డులు విప్పితే లోతుకుపోయిన కొడుకు డొక్కలూ, భార్య జాలికళ్ళూ కనబడతాయి. వాటిని వదిలి వారఫలితాలు మరొకసారి కలియజూశాడు. అంతా నిజమే. జయమే కనిపించింది. వారం మొదట్లో దారాపుత్రులు ఖాయిలా పడ్డట్టుగా తార్కాణం డాక్టరుగారి బిల్లు.—"వారాంతంలో ధనాధిపతి మంచిస్థానంలోకిమారటం వల్ల గాలివాటుగా అధిక ధనలాభం.... స్పెక్యులేషన్లలో ఈజన్మలగ్నస్థులకు చాలా లాభిస్తుంది! — అధిక ధనలాభం! జీవితాన్నంతా నిన్న నేడు తారుమారుచేసినధనం. అంటే అపజయం ఒప్పుకోనక్కర్లేదు. వెంకట్రామయ్యగారి ముందు నక్క వినయాలకు పోనక్కర్లేదు. చెక్రయ్యచెట్టిని తిరిగి ఒదులు చీవాట్లు పెట్టవచ్చు. భయపడవలసిన వస్తువుల్లో తిరిగి ఒక్క మృత్యువే మిగులుతుంది. తన ఆలోచనల అరాజకత్వంలో వేదాంతమూ, సూపర్ స్టిషనూ, వినాశకరమైన విమర్శనామిళితమైపోయాయి - అని ఫ్రాయిండ్‌లాంటి సైకో ఎనలిస్టు అనవచ్చు. కాని తను అనడు.

* * *

కామేశ్వరరావు మొదటినుంచీ ఏడవ నెంబరు గుర్రంమీదే ఆశలు కుదుర్చుకున్నాడు. గుర్రాన్నెక్కే జాకీ ఒక ఐరిష్ దొర. దాని బరువు పుస్తకంలో ప్రకారం అంత ఎక్కువా కాదు, అంత తక్కువా గాదు. గుర్రం పరిగెత్తేకాలానికి వర్జ్యం కాస్తా వెళ్లిపోతుంది. గుర్రాల్ని పారేడ్ చేయించినప్పుడు గూడా ఏడవ నెంబరును జాగ్రత్తగా చూశాడు. అది మొదటి రకం రంగుల అరబ్బు గుర్రం.

మూడు పలభై అయిదుకు గుర్రాలన్నీ రేసుకోర్సు ఆరవ ఫర్లాంగుమూల బయులుదేరినై. తను మొదటినుంచీ తెలివి గల అంచనాలే వేసుకొంటున్నాడు. ఆ గుర్రం దెబ్బకొట్టి గెలుస్తుందని చక్కగా తెలుసును గనక, యిందువిషయమై తను మీనన్ వద్ద అప్పుతెచ్చుకొన్న మూడు పదిరూపాయలనోట్లతోనూ, దానిమీదనే టిక్కెట్లు కొన్నాడు. గెలుపు విషయంలో ఈషణ్మాత్రపు సందేహంగూడా లేదు. రాహుకాలం వెళ్ళిపోయింది. మీనన్ గూడా దాని మీద కన్ను వేశాడు. వారఫలితాలు చెబుతున్నాయి. పైగా తను అపజయాలు ఒప్పుకొనే మనిషి గాదు. ఇటువంటి సువర్ణావకాశాన్ని జారవిడుచుకొనే మానవుడు మూర్ఖుడు!

గెలుపుమూల యింకో అరఫర్లాంగు దూరంలోవుండగా మీనన్ "బైనాక్యులర్స్" (దుర్భిణియంత్రం) అరువు పుచ్చుకొని చూశాడు. 7వ నెంబరు అన్ని గుర్రాలను వెనక్కుతోసి అప్పటికే పదిబారల ముందున్నది. గాలరీమెట్లమీద "పంటర్సు". అందరూ ఎవరిగుర్రాల నెంబర్లను వాళ్ళు వుచ్ఛరిస్తున్నారు - పెద్దగొంతుకల్తో. రావు గూడా - "అర్జునః ఫల్గుణః పార్థివః" అనుకొన్నాడు. వినాయకుడితో ప్రారంభించి యిష్టదేవతార్చన సలిపాడు (తనలో) ప్రకాశంగా - "ఏడు...ఏడో నెంబరు... నంబర్ సెవెన్...కమాన్ నెంబర్ సెవెన్ ......"

ఏడో నెంబరు తప్పక గెలవాలి. శుభశకునాలన్నీ అట్లాగే కనిపించినై. తను గేలరీలో కూర్చొన్నప్పుడు తన ప్రక్క వాడు రహస్యంగా ఏడో నెంబరుకు ఎదురుగా గీతల మార్కులు వేయటం చూశాడు. అతడి ముఖంలో వర్చస్సు వున్నది. తను మొదటి

---

చినతర్వాత, ఒక నెలరోజులకి సుబ్బయ్య తేరుకున్నాడు. కానీ- మనిషి చిక్కి శల్యమయ్యాడు. ఓపిక లేదు. తిండి అసలే పడిపోయింది. ధైర్యస్థయిర్యాలు తగ్గిపోయాయి. దేన్ని చూసినా అనుమానం, భయం!

ఇప్పటికీ వెంకయ్యతో వీరయ్యంటూంటాడు. "వాడొక పిచ్చిగుల్లయ్య! ఉత్తి అనుమానంతో చిక్కాడు—అంతేరా!" అని.

ఎంతటివాడికైనా అనుమాన పిశాచం యిట్టే లొంగదీస్కుంటుందని అనుకుంటూంటాడు— సుబ్బయ్య యిప్పటికీ. ★

టిక్కెట్టు కొనటానికి వెళ్ళినప్పుడు - తను అడక్కముందే పక్కవాడు అడిగిన జ్ఞాపకం. ప్రకారం టిక్కెట్లు అమ్మేవాడు ఏడో నెంబరు అచ్చుగుద్ది ముందు పడేశాడు. ఆ సంఖ్యన్ని చాలామంది ఫేవర్ చెయ్యటం లేదు. అంటే డివిడెండ్లు జాస్తిగా వుంటాయన్నమాట. తను కొన్నవి ఆరు టిక్కెట్లు.

తను చాలా రోజుల్నుండి కాలువా కొనుక్కోవాలను కొంటున్నాడు. పిచ్చి సుభద్ర...దాని అమాయికత్వాని కదేసాటి. పాపం ఒక్క గ్రామఫోనయినా కొనాలి. ఈవారు మామగారువచ్చి ఆశ్చర్యపోతాడు ...పిల్లవాడికి మంచి గ్లాస్కో డబ్బాలు కొని...బుర్ర తక్కువ చెక్రయ్యను నాలుగు చీవాట్లు తినిపించాలి.

కాని కన్నుమూసి కను తెరిచి నంతలో నే జరిగిపోయింది. తన సుద్రపు జాకీ విసుగుగా కిందపడ్డాడు. దానివనకనే వున్న తొమ్మిది ముందుకు మోరచాచింది. బోర్డుమీద గెలుపు అంకెలు: 9, 6, 4 గా కనిపించినై. ఏడు...ఎక్కడ ?

* ● *

ఆ రాత్రి—

సుభద్ర మాట్లాడకుండా వడ్డిస్తున్నది.

“అయితే సుబ్బూ, మీ నాన్నగారికి ఉత్తరం రాయాలన్నావుగాని రాశావా? కవరుమీద అడ్రెసు రాసి వుంచాను గూడా. మామగారికి నేనుగూడా రాసి చాలారోజు లైంది....అయితే....మరిచాను - రాస్తావు గదా...‘పిల్లవాడు కొంటె మాటలు మాట్లాడు తున్నాడు. చిలిపిపనులు చేస్తు న్నాడు. నగరం గనక వీధుల్లోకి తీసుకు వెళ్ళటం పడదు. యిళ్ళల్లో నాడికేమీ తోచదు. యిల్లు చిన్నది. యింట్లో రేడియో అన్నా లేదు. నేనుగూడా ఒక చీటి రాస్తాను.”

సుభద్ర మళ్ళీ కళ్ళనీళ్ళు ఒత్తుకొన్నది. కాని యివి ఆనంద బాష్పాలు.

“యిదుగో...సుబ్బూ...మనం కొంచెం ఖర్చులు తగ్గించుకోవాలి సుమా - నిన్నటి కాగితంలోని ఐటంలన్నీ చదివావుగదూ! ఆ పేపరువాణ్ణి మానెయ్యమని చెప్పు. నా కెందుకనో యిప్పుడిప్పుడు కాఫీ అంటే డోకు వస్తోంది.”

సమయానికి కాఫీ తయారు కాలేదని తను తిన్న తిట్లలో ఒక్కటైనా సుభద్రకు జ్ఞాపకం రాలేదు.

మన్నాడు ఆఫీసులో మీనన్ సిగరెట్టు యివ్వబోయినాడు. కామేశ్వరరావు నెమ్మదిగా “వద్దోయ్” అంటూ—

“మిస్టర్ మీనన్ - చూశావా? ఈ పసువులు...యీ పార్టీలు...యింత పని చేయించుకొంటారు....వాళ్ళ తాతగాడి సొమ్మల్లే...చివరకు మాట్లాడకుండా పోతారు”

మీనన్ కళ్ళరెప్పలు ఆర్పి తిరిగి తెరిచాడు. ★

## ★ కాలక్షేపం ★

(4-వ పేజీ తరువాయి)

దైన ఇట్టి కార్యసాధకునకే అట్టి సుఖదుఃఖాతీతావస్థ సిద్ధిస్తుంది.

నిత్యమూ మార్పుచెందుతూ ఉండే లక్షణం జగత్తుకు ఉంది. మార్పు అంటే సంస్కారం. సంస్కరణం అంటే కాలానుగతమైన మార్పు. ఈ జగత్తుయొక్క మార్పు జగత్తుయొక్క నిత్యచలనంవల్ల కలుగుతోంది. జగత్తు అనేది స్తంభించి స్థాణువుగా ఉండదు. సదా మార్పు చెందుతూ ఉండడం అనేటటువంటి ఈ స్థూల బాహ్య జగల్లక్షణమే “చరలింగ తత్వం”. వీరేశలింగం పంతులు పేరు చెప్పితే అందరికీ జ్ఞాపకం వచ్చేది సంఘసంస్కరణ. “వీరేశలింగం పంతులు” అంటేనే “సంస్కరణ”. సంస్కరణ వినా వీరేశలింగంపంతులు లేడు. సంస్కరణ అంటే మార్పు. వీరేశలింగంగారి బాహ్యచర్యల చరిత్రను స్థూలంగా పరిశీలిస్తే, వీరేశలింగ తత్వంలో ఉన్నటువంటిది చరలింగ తత్వమే అన్నట్లుగా కన్పిస్తుంది. కాని సూక్ష్మబుద్ధితో ఆయన అంతరాత్మలోని స్థాయీ భావమును పరిశోధిస్తే వీరేశలింగంగారిలోని విశిష్టతత్వం స్థిరలింగతత్వమని ఋజువు కాగలదు. మార్పులేని, స్థిరమైన, శాశ్వతమైన సత్యమునూ, ధర్మమునూ గ్రహించి దానినే అనుసరించవలెనని వాదించేది సనాతన మతం. వీరేశలింగం పంతులు పైకి సంస్కర్త. కాని, ఒక స్థిరమైన ధర్మప్రవృత్తి కలవాడగుట చేత సనాతనుడు.

దేహానికిగాని, మనస్సుకుగాని అవస్థాభేదములు ఎన్ని వచ్చినప్పటికీ తాటిఆకుల గ్రంథంలోని ఆకులు అన్నింటిలోనుంచీ పోతూ అన్నింటినీ ఒక్క గ్రంథంగా బంధించుచున్న సూత్రములాగున, ఒక్కటే స్థిరమైన స్థాయీభావం వీరేశలింగంగారి జీవిత దశాంతర్దశలలోని జీవితఘట్ట పరంపరలయందు కన్పిస్తోంది. దానినే ఆయనయొక్క ఆత్మవేదన అనవచ్చు. దానినే ఆయనయొక్క ఆత్మానందం అనవచ్చు. ఏమైనప్పటికీ, అచంచలమైన, మార్పులేని, స్థిరస్థావరమైన జ్యోతియొక్క దీపకళికలాగున ఒక ప్రజ్ఞ, ఆయనలో ప్రకాశించి ఆయనను ప్రబోధించింది. అదే ప్రకృతిలోని స్థిరలింగతత్వం. చలనంగల జగత్తులో చలనంలేని నిశ్చల తత్వం. ★

“ఏంటోయ్! రోడ్డంటా ఆలా చూస్తున్నావ్?”

“ఆ! ఏం లేదు; అక్కడ పోతున్నాడే, వాడేనండి నా సైకిలు దొంగిలించింది.”

“ఓహో! ఆలాగైతే వాణ్ణెందుకు అరెస్టు చేయించ లేదు?”

“సైకిలుకు కొత్త టయర్లు వేయించే వరకూ వేచి యుందామని చూస్తున్నానండి.”

—గోపీశ్రీ





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu ChettySt, Madras





మహాబలేశ్వర్ దగ్గరనున్న లిండ్మాలా జలపాతము
ఫొటో .—వి. ఆర్. నబ్నవీసు (బొంబాయి





వాల్తేరు బీచి
ఫొటో.—శ్రీ సి. సీతారాం (మద్రాసు.)

**Regd. No. M. 4479.** Andhra Patrika Illustrated Weekly




డిస్ట్రిబ్యూటర్లు

ఆంధ్ర, సీడెడ్ : నవయుగ ఫిలిమ్స్, విజయవాడ, గుంతకల్ | మైసూరు స్టేట్ ప్రకాష్ పిక్చర్స్, బెంగుళూరు

నైజాం : కర్ణాటక ఫిలిమ్స్ లిమిటెడ్, సికింద్రాబాద్ | వివరములకు ప్రకాష్ ప్రొడక్షన్స్, మద్రాసు - 26.